# పద్య సాహిత్యం : సంఘ చరిత్ర

## 1900 - 1950

బూదరాజు రాధాకృష్ణ

# రెండు మాటలు

పద్యవిద్యకు పురావైభవం పునరుద్ధరించాలనే తపన ఇటీవల ప్రబలమయింది. పూర్వపద్యసాహిత్యానికి సంఘజీవనవిధానాలమీద అభినివేశం చాలా తక్కువ. ఆ లోపాన్ని పరిహరించి రూపభేదమాత్రమైన సాహిత్యవిధానం చెప్పే సామాజికజీవనస్రవంతిని తరవాతి తరాలవారికి అందిస్తే బాగుంటుందనే భావన ఈ రచనకు దారితీసింది. ఇది చాలా చిన్న ప్రయత్నం. పరిమితకాలంలోని పద్యసాహితిని మాత్రమే అందినంతలో పరిశీలించి చేతనయినట్లు రాసిన చిన్న పుస్తక మిది. పాఠకుల కిది నచ్చుతుందని ఆశపడుతున్నాను.

శక్తిమంతులయిన ఆధునిక యువతీయువకులు ఈ నా ప్రయత్నాన్ని మరెంతగానో ప్రస్తరించగలరు. పూర్వాంధ్రసాంఘికచరిత్ర పునర్నిర్మాణానికి నాటి పద్యసాహిత్యం ఎంతగా తోడ్పడిందో సూచనప్రాయంగా ప్రదర్శించటమే రచనాలక్ష్యం. ఇందులోని లోపాలకు క్షంతవ్యుణ్ని.

ఈ పుస్తకం చిన్నదేగాని రచనకు అవసరమైన ఆధారగ్రంథాలూ సమాచారమూ పాతకాలానివి. వాటిని సమకూర్చి తోడ్పడి నా కృతజ్ఞతలకు అర్హులైనవారు -

ఏకాంబరాచార్యులు, శ్రీ రాపాక
చక్రధర్, డాక్టర్ గోవిందరాజు
చంద్రశేఖరరెడ్డి, డాక్టర్
ఛాయాదేవి, శ్రీమతి అబ్బూరి
తారకరామారావు, శ్రీ నెమలికంటి
నిర్మలాదేవి, డాక్టర్ నిడమర్తి
పార్థసారథి, శ్రీ నండూరి
మల్లికార్జునరావు, శ్రీ కాకరపర్తి వెంకటదుర్గా
ప్రభాకర్, శ్రీ కె.
రమణ, డాక్టర్ కె.ఎస్.
వెంకటప్పయ్య, డాక్టర్ వెలగా
సత్యనారాయణమూర్తి, శ్రీ తల్లాప్రగడ
హనుమచ్ఛాస్త్రి, డాక్టర్ జానమద్ది

ఈ గ్రంథ ప్రచురణ బాధ్యత స్వీకరించిన ప్రాచీ పబ్లికేషన్స్ నిర్వాహకుడు శ్రీ పి.పి.సి. జోషికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

హైదరాబాద్ — - బూదరాజు రాధాకృష్ణ
1-11-2005

# పద్యసాహిత్యం: సంఘచరిత్ర

తెలుగులో క్రీస్తుశకం 9వ శతాబ్దినుంచీ పద్యరచనలు లభిస్తున్నా, అవి సాధారణంగా రాజాశ్రితాలుగానో, భగవత్పూజార్పితాలుగానో సాగాయి. తదితరాలు చాలావరకు నీతిబోధకాలు. సంస్కృతప్రాకృతసాహిత్యాల ప్రభావంవల్ల వాటిలోని (ప్రక్రియా) వైవిధ్యం సంక్రమించలేదుగాని, ఏదో ఒక ధోరణిలో - పురాణప్రబంధాదిరూపాల్లో - తెలుగుపద్య కవిత్వం శతాబ్దాల పర్యంతం కొనసాగింది.

దర్బారీకవులకు తమచుట్టూ ఉన్న సహజవాతావరణ స్పృహ లేదు. భక్తులకు లౌకిక దృష్టి లేదు. ఎక్కడో ఎప్పుడో ఎవరోఒకరు లోకవృత్తాన్ని స్మరించినా, అది పరిమితం; మాటవరసకు పేర్కొన్న విషయం. పురాణాదులవల్ల ఆర్యసంస్కృతివర్ణన అధికమై ఆంధ్రజాతి సమస్యలు అంతగా ప్రస్తావనకు రాలేదు. ముస్లింపాలన భక్తివైపో, నిరాశానిస్పృహలవైపో నడిపించింది. పాశ్చాత్యపాలన వచ్చిన తరవాత ఒకటి రెండు శతాబ్దాలు గడిచిందాకా మన పద్యకవుల దృష్టి సమాజస్థితిగతులవైపు మళ్ళలేదు. అందువల్లనే సాహిత్యం ప్రధానాధారంగా ఆంధ్రుల సాంఘికచరిత్రనిర్మాణం సురవరం ప్రతాపరెడ్డిగారిని బాధించింది, విసిగించింది, హింసించింది.

క్రీస్తుశకం 19వ శతాబ్దిలో ఒకరిద్దరు మహాకవులదృష్టి సువిశాల ప్రపంచంవైపు, సమాజ పరిస్థితులవైపు ప్రసరించినా, సామాన్యకవులు గతానుగతికస్థితినుంచి బయటపడలేదు. ఇంతలో వంగదేశంనుంచి వచ్చిన సామాజిక రాజకీయ సాహితీ ప్రభావాలకు మైమరచిన మన భావకవులు, ఊహాప్రపంచంలో ఊగులాడుతూ "దిగిరాను దిగిరాను దివినుంచి భువికి" అని మొరాయించారు. కాకపోతే కొన్నిసార్లు పూర్వాంధ్రవైభవస్మృతితో దేశమాతలను పూజించారు. ప్రపంచరాజ్యాల్లో మార్క్సిజం పెనుమార్పులు తెస్తున్న సమయంలో, ఒకటో రెండో ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో, ఛందోబంధాలు పట్టుకోల్పోతున్న తరుణంలో మన పద్యకవులకు తాము నివసిస్తున్న సమాజం గుర్తుకు వచ్చింది, కదిలించింది.

స్థూలంగా మన పద్యకవితాపరిస్థితి ఇది. కొంత శ్రమిస్తే ఈ సాధారణస్థితిని అధిగమించిన పద్యకవులు కొందరిని గుర్తించవచ్చు. వారి రచనలద్వారా మన సమాజ పరిస్థితులను కొంతకు కొంత తెలుసుకోవచ్చు. పద్యేతరరచనల్లో సామాజికస్పృహ ఎక్కువ. అందులోనూ వచనరచనల్లో అత్యధికం. పద్యవిద్యను పునరుద్ధరిద్దామనుకొంటున్నవాళ్ళు చాలామంది అవధానవిద్యను ఆరాధిస్తున్నారు. స్వయంగా సమాజదౌర్భాగ్యాలకు సంచలించని అవధానులు, పృచ్ఛకులను సంతృప్తిపరచటంకోసం ఏవో కొన్ని పద్యాలు చెప్తున్నారు. గేయ వచన కవితలు నినాదబంధురంగా ఉంటున్నాయి.

పరకాయించి చూస్తే ఆంధ్రుల సాంఘిక చరిత్రను విశదీకరించే పద్యకవిత ఈనాటికీ అల్పాల్పంగానే ఉందనిపిస్తుంది. ఉన్నంతలో, దొరికినంతలో ఆ కొంత చరిత్రనయినా సోదాహరణంగా నిరూపించటమే ఈ రచనా ప్రయోజనం. ఇది సమగ్రమూ కాదు, సువిస్తృతమూ కాదు. ఈ ధోరణిలో పరిశ్రమించి పరిశోధించగల శక్తిమంతులకు అనేక మార్గాలుండగా, అందులో ఇదొకటని నిర్దేశించే ప్రయత్నమాత్ర మిది. క్రీస్తుశకం ఇరవయ్యో శతాబ్ది పూర్వార్ధానికి పరిమితమై పద్యకవిత్వం ద్వారా రాజకీయచరిత్రనూ సంఘచరిత్రనూ సంక్షిప్తంగా సమన్వయించటానికి చేస్తున్న సాహసమే ఇది.

## పూర్వరంగం

మొఘలాయీలు భారతదేశాన్ని పాలిస్తున్న సమయంలోనే వర్తకవాణిజ్యాల కోసమని పాశ్చాత్యులు భారతదేశంలో అడుగుపెట్టారు. క్రీ.శ. 1498లో వాస్కోడగామా కాలికట్లో ప్రవేశించిన తరవాత పన్నెండు సంవత్సరాల్లోగా, క్రీ.శ. 1510 నాటికే గోవాప్రాంతం పోర్చుగీసువారికి స్వాధీనమయింది. విజయనగరంలో పోర్చుగీసు రాయబారి ఉండేవాడు. అంతకు ముందుకాలంలోనే పాశ్చాత్యులు మనదేశంలో కొత్త వస్తువులను ప్రవేశపెట్టారు. మిరపకాయ, అనాస, జామ, కందులు, మంచిగుమ్మడి మొదలైనవి మన ఆహారపదార్థాల్లో కొత్తగా చేరగా సంప్రదాయవాదులు వాటిని 'విశ్వామిత్రసృష్టి'గా పరిగణించి, రెండుమూడు శతాబ్దాలకాలం మతసంబంధ కర్మకాండల్లో వాటి వాడుకను నిషేధించారు. ఆంధ్రప్రాంతంలో బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చి వాళ్లు ఆధిపత్యం కోసం పోరాడారు. క్రీ.శ. 1600లో బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ, 1602లో డచ్ ఇండియా కంపెనీ వెలిశాయి. 1639లో మదరాసులో ఫోర్ట్ సెయింట్ జార్జి నిర్మాణం జరిగింది. 1760లో వందవాసీ యుద్ధంలో ఫ్రెంచివాళ్లు పరాజితులయితే బ్రిటిషువారు విజేతలయినారు. 1766 నాటికి ఉత్తర సర్కారులు, 1802 నాటికి రాయలసీమ బ్రిటిష్‌వారి పాలనకిందికి వచ్చినా, భారతదేశం స్వతంత్రమైన తరవాత రెండేళ్లకుగాని తెలంగాణా నిజాం దుష్పరిపాలననుంచి వేరుపడలేదు - 1948దాకా. స్థూలంగా క్రీ.శ. 17వ శతాబ్ది నాటికే తెలుగుదేశం బ్రిటిష్‌వారి ప్రభావానికి లొంగిందని చెప్పవచ్చు. తెలుగులో క్రైస్తవవాఙ్మయం 1720లో మొదలయింది. 1746లో తెలుగు అచ్చును బెంజమిన్ షూల్జ్ ప్రవేశపెట్టారు. మదరాసులో 1802 నుంచి ప్రభుత్వ ప్రకటనలు తెలుగులో వెలువడటం మొదలయింది. అక్కడనుంచే 1806లో తెలుగుముద్రణ మొదలయింది.

క్రీ.శ. 1802-04 మధ్యకాలంలో శాశ్వత భూమిశిస్తు విధానం అమల్లోకి వచ్చింది. ఫలితంగా కొత్త జమీందార్లు పుట్టుకవచ్చారు. 1813 నుంచి ఫోర్టు సెయింట్ జార్జి కళాశాల స్థాపన తరవాత తెలుగులో ఆంగ్లపద్ధతి విద్యాబోధన వేగమందుకుంది. 1818లో బ్రిటిష్‌పద్ధతి న్యాయస్థానాలు వెలిశాయి. 1820లో గ్రామపంచాయితీలు, 1827లో మ్యునిసిపాలిటీలు ఏర్పడ్డాయి. 1828లో 'వృత్తాంతి' అనే తెలుగుపత్రిక ఉద్భవించింది. 1838లో ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్రకు బయలుదేరే నాటికి మొత్తం భారతదేశం బ్రిటిషువారికి

స్వాధీనం కాలేదు. 1819లో మహారాష్ట్రుల పరాజయం పూర్తయింది గాని, లాహోర్ రాజధానిగా రాణా రంజిత్‌సింగ్ సిక్కురాజ్యం స్వతంత్రంగానే ఉంది - 1831లో మొదలై 1849లో బ్రిటిష్‌వారి హస్తగతమయ్యేదాకా. విలియం బెంటింక్ భారత గవర్నరు జనరల్గా ఉండగా బ్రహ్మసమాజప్రభావం బెంగాల్లో విస్తరించింది. సాంఘిక సంస్కరణల్లో ఇంగ్లీషువారి ప్రమేయానికి నిదర్శనగా 1829లో సతీసహగమనాన్ని నిషేధించారు. 1852-56 మధ్యకాలంలో కృష్ణానదికి ఆనకట్ట కట్టారు. కలకత్తానుంచి రైలుమార్గం వేయాలని నిశ్చయించారు. 1853లో బొంబాయి-థాణే రైలుమార్గం వచ్చింది. ఆయేడే కలకత్తా రైలుమార్గం నిర్మాణం కూడా మొదలయింది. 1854లో పోస్టల్ వ్యవస్థ ఆరంభమయింది. పాక్షికప్రజాపాలనకోసం కౌన్సిళ్లు నెలకొన్నాయి. 1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగిన సమయంలోనే మదరాసు విశ్వవిద్యాలయ మేర్పడింది.

కందుకూరి వీరేశలింగం (1846-1919) బ్రహ్మసమాజజ్ఞానంవైపు ఆకర్షితుడైనాడు. సంఘ సంస్కరణ నిమిత్తం కొత్త సాహిత్య ప్రక్రియలను తెలుగులో ప్రవేశపెట్టాడు. 1874లో వివేకవర్ధినీ పత్రికను స్థాపించి తన వాదాలను సరళమైనభాషలో లోకానికి తెలియజెప్పటం మొదలు పెట్టాడు. 1878లో బాల్యవివాహాలను వ్యతిరేకిస్తూ 'బ్రహ్మవివాదం' అనే నాటకం ప్రచురించాడు. దానికి 'పెద్దయ్యవారి పెళ్ళి' అనే పేరు వచ్చింది ప్రజల్లో. 1879లో 'వ్యవహార ధర్మబోధిని' అనే నాటకం వెలువరిస్తే, దానికి 'ప్లీడర్ల నాటకం' అనే వ్యవహారనామం వచ్చింది; 1880లో దాన్ని ప్రదర్శించారు కూడా. అదే తెలుగులో జరిగిన మొదటి నాటకప్రదర్శన. వీరేశలింగంగారి రంగప్రవేశంతో ఆధునికాంధ్రయుగం మొదలయిం దనాలి తెలుగు సాహిత్యంలో. ఆ సంవత్సరమే 'స్థానిక స్వపరిపాలన' విధానం అమల్లోకి వచ్చింది. 1885 డిసెంబరు 31వ తేదీన బొంబాయిలో భారత జాతీయ కాంగ్రెసు సంస్థానిర్మాణం జరిగింది. ఆయేడే ప్రభుత్వం విధిస్తున్న పన్నులను ఆక్షేపిస్తూ చిలకమర్తి లక్ష్మీనరసింహం (1867-1946) గోదావరిమండల సభలో "నేల దున్నుదు మన్నఁ జాల తరము పన్ను, నీరు గావలెనన్న నీటిపన్ను'' ఇత్యాదిగా రకరకాల పన్నులు విధించి ప్రజలను వేధిస్తున్నారని ప్రభుత్వాన్ని విమర్శించాడు. 1886లో దాదాభాయ్ నౌరోజీ కాంగ్రెస్ వేదికమీద 'స్వరాజ్య' ప్రస్తావన తెచ్చాడు. గురజాడ వేంకట అప్పారావు (1861-1915) 'కన్యాశుల్కం' నాటకం 1897లోనే ప్రదర్శిత మయింది. ఆయన కూడా వీరేశలింగంలాగానే సాంఘికదురాచార విమర్శనాదులకు పద్యేతరసాహితీప్రక్రియలనే ఆయుధాలుగా ఎంచుకున్నారు.

క్రీ.శ. 19వ శతాబ్దాంతంలోగా బ్రిటిష్‌వాళ్లు ప్రవేశపెట్టిన కొన్ని ప్రజోపయోగకర కార్యక్రమాలు లేకపోలేదు. అర్ధణా పోస్టల్ స్టాంపు 1853లో వస్తే, కార్డును 1879లో, మనీఆర్డరును 1880లో, పొదుపుబ్యాంకును 1888లో పోస్టల్‌శాఖ వాడుకలోకి తెచ్చింది. 1893లో కృష్ణమీద వంతెన నిర్మాణం పూర్తి అయింది. బెజవాడ-కొవ్వూరు రైలుమార్గం, విశాఖపట్నం-తుని రైలుమార్గం 1893లోనే మొదలయినాయి. మరుసటి సంవత్సరం విజయనగరం-బొబ్బిలి రైలుమార్గం పూర్తయితే, 1897లో కాకినాడ-సామర్లకోట రైలుమార్గం

వచ్చింది. మదరాసునుంచి బెజవాడకు 1897 నాటికి రైలుమార్గం పడింది. గోదావరి వంతెన 1900లో పూర్తయింది. 1898లో ఇండియన్ పోస్టల్ ఆక్టు అమల్లోకి వచ్చింది. అత్యంత సంక్షిప్తంగా ఇరవయ్యో శతాబ్ది ఆరంభంనాటికున్న దేశకాలపరిస్థితు లివి. ఆ తరవాత తెలుగుపద్య సాహిత్యంలో సామాజికరాజకీయపరిస్థితుల ప్రతిఫలనం కనిపిస్తుంది - కొన్నిసార్లు మొదటి దశాబ్దం నిరాశాజనక మనిపించినా. ఆ వివరాలను మరికొంత విపులంగా పరిశీలిద్దాం.

## తొలి రాజకీయ నిదర్శనలు

ఇరవయ్యో శతాబ్దం తొలిదశకంలోనే భారతదేశంలో రాజకీయసంక్షోభం స్వరాజ్య సాధనదిశగా బలపడటం మొదలయింది. ఆంధ్రసాహిత్యరంగంలో రబీంద్రనాథ ఠాకుర్ ప్రభావం ఒకవైపు, బంకించంద్ చటర్జీ భావన మరోవైపు వ్యాప్తిలోకి వచ్చాయి. రాజా రామ్మోహన్ రాయ్ ప్రభావంవల్ల స్త్రీవిద్య, బాల్యవివాహ వ్యతిరేకత, విధవావివాహ సాధన, వేశ్యావృత్తిని గర్హించటం వంటి సామాజిక విషయాలు కందుకూరి వీరేశలింగం, గురజాడ వేంకట అప్పారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం వంటి విద్వత్కవుల నాకర్షించాయి. వంగదేశంలో రబీంద్రనాథ్ ఠాకుర్ లేవదీసిన 'చలిత్ భాషోద్యమ' ప్రభావం గిడుగు వేంకట రామమూర్తి (1863-1940) వ్యావహారికోద్యమానికి దారితీసింది. అది 1910 నాటికే బలపడింది. బంకించంద్ రాసిన వందేమాతరగేయం అపూర్వ సంచలనం సృష్టించింది. అంతకుముందు భరతఖండం, భరతదేశం వగైరా పేర్లతో వ్యవహరించే భూమాతను, జన్మభూమిని విష్ణుమూర్తి భార్యగా, లక్ష్మి సవతిగా భావించేవారు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనే మాటల్లో తాము పుట్టినచోటు స్వర్గంకన్నా గొప్పదని, తల్లివంటిదని అనుకొనేవాళ్ళు, ఇంగ్లీషువాళ్ల 'mother land' అనే భావనకు అది సమానమని భావించటం మొదలుపెట్టారు. ఆ దశలో 'భారతమాత' అనే అమూర్తదేవత దేశరూపంలో అవతరించింది. (దరిమిలా ఆంధ్రమాత, తమిళమాతల్లాగా పరిణమించి సోదరీత్వానికీ మాతృత్వానికీ భేదం లేదన్నంతగా వికసించింది)! ఆ సమయంలో - 1905లో - కలకత్తా కాంగ్రెస్ వేదికమీదినుంచి దాదాభాయ్ నౌరోజీ స్వరాజ్యభావన ప్రపంచించాడు. ఆయేడే బ్రిటిష్ ప్రభుత్వం బెంగాలును విభజించింది. విభక్త వంగదేశంలోని ఢాకాలో 1906లో ముస్లింలీగ్ అనే మతరాజకీయసమాజం ఆవిర్భవించింది. బ్రిటిష్‌వాళ్లు రాష్ట్ర విభజనతోబాటు జాతిమతవిభేదాలను గూడా సాధించామని సంతోషించా రన్నంతకాలం పట్టలేదు - చేసిన తప్పు దిద్దుకోటానికి. వందేమాతరగేయం స్వాతంత్ర్య రణన్నాదంగా పర్యవసించింది. నౌరోజీని ప్రభుత్వం నిర్బంధించింది. బెంగాలీవక్త బిపిన్ చంద్ర పాల్ ఈ దుశ్చర్యను నిరసిస్తూ దేశమంతా పర్యటించి స్వరాజ్యభావనలను ప్రకోపింప జేశాడు. ఆయన రాజమహేంద్రవరానికి వచ్చినప్పుడు 1907లో జరిగిన బహిరంగసభలో చిలకమర్తి లక్ష్మీనరసింహం పద్యరూపంలో నిరసన వ్యక్తీకరించాడు :

"భరతఖండంబు చక్కని పాడియావు
<u>హిందువులు</u> లేగదూడలై యేడ్చుచుండ

తెల్లవా రను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియఁగట్టి.

"దుడుసుదనమును గోర దీ గడుసుదనము
కాన తాపులు పోటులు కార్యమనక
లేగలన్నిటి నేకమౌ లా గొనర్చి
నేర్పుతోఁ దల్లి యెగఁజేప నేర్పవలయు...

"వందేమాతర మను నీ
వందారుజనాళి కిపుడు వాత్సల్యముతో
డం దేశమాత యమితా
నందం బొనఁగూర్పుఁగాక నానార్థదయై."

ఈ పద్యాల్లోని 'హిందువులు, వందేమాతరం, దేశమాత' అనే మాటలను జాగ్రతగా గమనించాలి. అప్పటి బెంగాల్ విభజన 1947 నాటి పాకిస్థాను భాగమైన తూర్పుబెంగాల్లాగా ముస్లిం దేశమయిందన్న సూచన గమనార్హం. వందేమాతరం అనే నినాదం మహోద్యమంగా విస్తరించి ప్రభుత్వాన్ని కుదిపివేసింది. పర్యవసానంగా 1911లో బెంగాల్ రాష్ట్రాన్ని సమైక్యం చేయక తప్పింది కాదు. ఇంత రాజకీయావేశంగల రాష్ట్రంలో దేశరాజధాని ఉండటం మంచిది కాదని భావించిన బ్రిటిష్ ప్రభుత్వం, దాన్ని కలకత్తానుంచి ఢిల్లీకి మార్చాలని నిశ్చయించింది. (స్వతంత్రభారతంలో రబీంద్రనాథ్ ఠాకుర్ రాసిన "జనగణమన..." గేయం పంచమ జార్జి చక్రవర్తిని ప్రస్తుతిస్తూ రాసిందయినా, అందులోని సింధురాష్ట్రం మనదేశంలో లేకపోయినా, అందులో పేర్కొన్న పంజాబ్ వంగ రాష్ట్రాలు చీలి కొంత పాకిస్థాన్‌లో భాగమయినా అదే మన 'జాతీయగీతం' కావటం, ఒక మహోద్యమానికి హేతుభూతమయిన వందేమాతరగీతం ఆ ప్రతిష్ఠకూ, స్థానానికీ నోచుకోకపోవటం మనజాతి విలక్షణతకు చిహ్నం.)

## తొలి సాంఘికచరిత్రాధారాలు

తెలుగు సమాజం అనుభవంలోకి వచ్చిన నూతనావిష్కరణాదులను విపులంగా వర్ణించిన తొలికవి వడ్డాది సుబ్బారాయుడు (1854-1938). 1900 నాటికే వాడుకలోకి వచ్చిన రైలు, తంతి తపాల, పొగయోడ, గాలిఓడ వగైరాలను గురించి ఆయన ప్రస్తావించాడు :

రైలు :

"ధూమశకట వేగ మేమని వర్ణింతు
భూమిఁ గంటఁబడుచుఁ బోవునట్టి
వేవిగాని సాటిరావు దానికి వడి
దానివంటి దొకటె దాని నీడ!" (ఆయన రాసిన 9 పద్యాల్లో ఇదొకటి)

**తంతి-తపాల :**

"ఏలికకన్నన్ బ్రతిభా
శాలి ప్రధానుండు లేక జరగదు ధరణీ
పాలనము; చెంతఁ దంతి త
పాల నిలక రైలునడక భద్రం బగునే?"

స్టీమరు :

"రేవు దాటెడు ప్రజలతోఁ గ్రిక్కిఱియఁగ
వడికి నెదురెక్క నేరక వఱదయేట
మందగతి నేగుచున్న స్టీమరును జూడఁ
బూర్ణగర్భాలసాంగనాస్ఫురణ మయ్యె."

"జలపరిమాణసూచి పదసంఖ్యలతో నదినుండి లాకు లో
పలికిని బోవుదారి కిరుప్రక్కలఁ బాఁతిన రెండు కంబముల్
తలదనుకన్ మునుంగ వఱదన్, బయిఁ దోఁచెడు దాని గుమ్మటం
బుల నడుఁజక్కినుంచి యల బొబ్బరిలంకకుఁ బోయి..."

(ఇది 112 పాదాల చంపకమాలిక)

పెద్దమార్పులు :

"చదల గాలియోడ సంద్రానఁ బొగయోడ
భూమి రైల్ సయికిలు మోటరులును
శీఘ్రయానము లివి శ్రీమంతులకు నాంగ్ల
పాలనంబునం ద్రిపథములందు."

"రైలుఘోషకు జంకి మూలమూలల దాగె, బంగరడ్డల గూడుపల్లకీలు
బ్యాండుమేళము కంటఁబడ సిగ్గుపడెఁ బెండ్లి, తోరణా లదలించు వీరణాలు
మాయమైపోయె ముద్రాయంత్రముల దాడిఁ, దాళపత్రాలు గంటాలు నొఱలు
నగ్గిపుల్లలపెట్టియల యార్భటికి విచ్చు, మొగ్గలయ్యెను జెకుముకులు ఱాలు

మాటకలముల పాళీల పోటికోడి
బాతు నెమ లీకె లంగళ్ళు పాసిపోయె;
సల్పఁ బ్రతిశిల్పమును బూర్వశిల్పమునకు
నబ్బురంపు విశ్వామిత్రు లాంగ్లజనులు!"

**విద్యుద్దీపం :**

"చుట్టును దమస్సుఁ దేజమ్ము నట్టనడుమ
గలిగి చిటిగాజుకుప్పెను వెలుగు దివ్వె
కృష్ణమార్జాలనేత్రసాదృశ్యమునకు
నర్హమై యందమందుఁ ద్రియామములను"

**వేషధారణలో మార్పులు :**

"అంద మన్నది డెందంబునందె కాని
వస్తువం దంతగా లేదు వాస్తవంబు,
దుర్మతిని సీమ జిలుగుదుస్తులను గాల్చి
తాల్చి రాష్ట్ర స్వదేశ్యఖద్దరు పటాళి"

**స్త్రీవిద్య :**

"...పడఁతులు విద్యనేరువని పక్షమునన్ బరు వొక్క ప్రక్కనే
పడి తనుయాత్రయందు బహుబాధ గృహస్థులకుం దటస్థమౌ...
"లో, పలి వెలుఁగైన విద్దియ యవశ్యముగాదె యదృశ్యమధ్యకున్?"

**సంఘభాషాసంస్కారాలు :**

"విధవ సధవఁ జేయ వీరేశలింగంబు
గ్రామ్య రమ్యఁ జేయ రామమూర్తి
కందుకూరు గిడుగు కలశాబ్ధులం గల్గి
రగ్రవర్ణు లిర్వు రాంధ్రభూమి."

**కాకినాడ కాంగ్రెసు (సభ) :**

"పటుజపాను బెను తుపానునం బరిమార్చె
జలధిముంచె దరి విశాఖనగరిఁ
గాకినాడపురినిఁ గాంగ్రెస్సున నలర్చె
నెత్రు గ్రక్కునేట నెఱపను లివి...

"...ఎనిమిదియేండ్లు ముప్పదిపయింగల యీడునఁ గాకినాడ వ
చ్చె నఖిలభారతీయసభ..."

**మారిన అలవాట్లు :**

"ఆహితాగ్ని కూత కానరాదో నోర
నూదు చుట్ట; యజినమో పిఱుందఁ

జీరుకచ్చ; కృత్తశీర్షజుల్ మీసాల
యయ్యు లుండ్రు సోమయాజులు కలి."

పైన పేర్కొన్న పద్యాలు 1925లో ప్రచురితమైన 'వసురాయచాటు ప్రబంధం'లోవి. కాకినాడ-సామర్లకోట రైలుమార్గం 1897 నాటికే సిద్ధమయిందని ఇంతకుముందే ప్రస్తావించాం. 'పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ యాక్ట్' 1898లో అమల్లోకి వచ్చింది, ఆంధ్రప్రాంతంలో. స్టీమరు 1837 నాటికే వాడుకలోకి వచ్చింది. ఆనకట్టలు కట్టినప్పుడే లాకుల ఏర్పాటు జరిగింది. కవి 'గుమ్మటా'లని పేర్కొన్నవి నదిలో పడవ నడపవలసిన మార్గాన్ని నిర్దేశించే 'buoys' అనేవి. మోటారుకార్లు 1925 లోగానే మనదేశంలో ప్రవేశించాయి - యూరపులో 1888 నాటికే ఉన్నా. సైకిలు వాడుక 1840 నాటికే ప్రజామోదం పొందింది. 'వీరణములు లేని పెండ్లి వృథరా సుమతీ' అనే ప్రఖ్యాతి ఉంది. వాటి స్థానంలో బ్యాండ్ మేళాలు (band) బ్రిటిష్‌సేనలతోబాటే దిగుమతి అయివుండవచ్చు. 1846 నాటికే ముద్రణ మొదలయింది. నిప్పుపుల్లల పెట్టెలు (safety matches) 1826కు అంగళ్లలోకి వచ్చాయి. ఊటకలం (fountain pen) 1884 నుంచీ వాడుకలోకి వచ్చింది. విద్యుద్దీపాలు (electric bulbs/lamps) 1879 నాటికే అందుబాటులోకి వచ్చాయి (డైనమోల ద్వారా విద్యుదుత్పత్తి కాకినాడ ప్రాంతానికి 1929 దాకా రాలేదు). 1906లో కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలో 'స్వాతంత్ర్యం మా జన్మహక్కని' గర్జించాడు బాలగంగాధర తిలక్. అప్పుడే దేశవ్యాప్తంగా జాతీయవిద్యావిధానం ఏర్పడాలనీ, దేశవాళీపరిశ్రమల అభివృద్ధి సాధనలో భాగంగా విదేశవస్తు బహిష్కారం కర్తవ్యమనీ చాటారు. ఆ నిర్ణయాల అమల్లోభాగంగా విదేశీవస్త్రదహనం, స్వదేశ వస్త్రమైన ఖద్దరుధారణం మొదలయినాయి.

స్త్రీవిద్యను ప్రస్తావించిన పద్యాన్ని 1905లో రాసినట్లు కవి నిర్దేశించాడు. వీరేశలింగం విధవావివాహోద్యమం, గిడుగువారి వ్యావహారికభాషావాదం ఆ మహనీయుల జీవితకాలంలోనే - 1910 ప్రాంతంలో - సమకాలిక సమాజగౌరవాభిమానాలు సంపాదించాయనటానికి సంప్రదాయ విద్వత్కవి వడ్డాది సుబ్బరాయుడు ప్రస్తావనే నిదర్శనం. ఆయన జన్మించింది 1854లో. తనకు 38 ఏండ్ల వయసు వచ్చేనాటికి - అంటే 1892లో - కాకినాడలో భారతజాతీయ కాంగ్రెసు సమావేశాలు జరిగాయని ఆయన సాక్ష్యమిస్తున్నాడు. ఆ సందర్భంలో ఆయన పేర్కొన్న రెండు విశేషాలకు ఆయన పద్యమే సాక్షి. మొదటిది ఆ సంవత్సరం జపాను పెనుతుఫానుతో బీభత్సమయిం దనేది. రెండోది విశాఖపట్టణం సముద్రతీరం కోతకు గురయిందని. ఈ రెండు దుర్ఘటనలూ రక్తం చిందిస్తే, కాంగ్రెస్ మహాసభ కాకినాడపురాన్ని ఆనందాబ్ధిలో ఓలలాడించిం దన్నాడు. ఆయన పేర్కొన్న మరి మూడు విషయాల్లో ఆహితాగ్నులయిన బ్రాహ్మణులు కూడా చుట్ట (cigar)కు అలవాటుపడుతున్నారనే దొకటి. పొగాకు పాశ్చాత్యులు తెచ్చిన పంట. చుట్ట దాని వినిమయాల్లో ఒకటి. తరవాతికాలంలో అది సిగరెట్టుగా మారి కవిజనాల నాకర్షించింది. దానికి మరోరూపం పొడుము/నశ్యం. నశ్యం పండిత ప్రీతిపాత్రమే గాక, 'వశ్యకర'మనే ప్రతిష్ఠను సంపాదించింది - సంస్కృతాంధ్ర కవితల్లో.

ప్పారో స్పష్టంగా తెలియని చాటుపద్యా లనేకం పొగాకుమీదా, ముక్కుపొడిమీదా ). చాటుపద్యరత్నాకరం, చాటుపద్యమణిమంజరి వంటి గ్రంథాల్లోనేగాక గురజాడవారి ్కంలో కూడా దాని ప్రశస్తి కనిపిస్తుంది. గోచీకట్టు పంచెల వాడుక బహుశా బెంగాలీ ంవల్ల అలవాటయిందేమో తెలీదుగాని, 'సైకిలుకట్టు' నిన్న మొన్నటిదాకా వాడుకలో స్త్రధారణ పద్ధతి. జుట్టు కత్తిరించుకోవటం (cropping), వైదికులు మీసాలు పెంచటం ష్టికి వచ్చిన అనాచారాలు. సమాజసంస్కారాల్లో వచ్చిన మార్పుల నీ పద్యాలు చాయి. వాడుకనుంచి తప్పిపోతున్న సాంప్రదాయిక వస్తువుల్లో గూడుపల్లకీలూ, కుపుస్తకాలూ గంటాలూ వాటి ఒరలూ, వీరణాలూ, చెకుముకిరాళ్ళూ, బాతీక నెమలీక ంా ఉన్నాయని వాటిని విశ్వామిత్రసృష్టిభాగా లన్నాడు కవి. ఆంగ్లేయులే సరికొత్త మిత్రు లన్నాడు.

## అవధానకవితలో సంఘం విషయం

1908 ప్రాంతాల్లో తెలుగులో భావకవిత్వోద్యమం మొదలయింది. మహాకావ్యాల ంలో చిన్న రచనలు వచ్చాయని వెక్కిరిస్తూ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఈ ణి కవితను 'కొత్తిమిర కవిత్వం' అని వ్యవహరించారు. సంఘ పరిస్థితులకూ ఈ కవితకూ బంధం లేదు. 1910 ప్రాంతాలకే అవధానకవిత్వం సుడిగాలిగా వ్యాపించింది. కవులు మా సందర్భాల్లో పృచ్ఛకుల కోరికమీద చెప్పిన పద్యాల్లో కొన్ని సాంఘిక చరిత్రకు ంతవరకు పనికివస్తాయి. అవధానుల్లో పేర్కొనదగ్గవారు తిరుపతి వేంకటకవులనే ంటకవులు (దివాకర్ల తిరుపతిశాస్త్రి: 1872-1919; చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి: 1870-1950). ి పద్యాలద్వారా తెలియవచ్చే సంఘపరిస్థితులను పరిశీలిద్దాం.

తిరుపతి వేంకటకవులకు గురుకులవిద్యమీద ఉన్న గౌరవం, బ్రిటిషువారు అమలు రుపుతున్న ఇంగ్లీషు విద్యమీది అసద్భావం కింది పద్యాల ద్వారా గ్రహించవచ్చు :

**ురుకులవిద్య :**

*"<u>బెంచీ</u> లక్కఱలేదు, <u>గేమ్సు</u> మొదలౌ <u>ఫీజుల్</u> వినన్ రావు, పా*
*మ్మంచు న్నిర్దమఁ ద్రోసిపుచ్చరు గురుల్, <u>ప్రాసైన</u>నే లాభ మిం*
*దంచున్ నేమము లేదు, మీ చదువునం దాలోకమీలోకమున్*
*గాంచన్ వచ్చెడి, నార్యులార! మిము ద్రొక్కన్ వచ్చు నెక్కాలమున్"*

**ఇంగ్లీషువిద్య :**

*"తిరిపం బెత్తెడి వారి నెయ్యది మహాదేవేంద్రులం జేయునో*
*పరనీచాన్వయజాతు నెయ్యది మహావంశోత్తముం జేయునో*
*ధరణిన్ వైదికునైన నెయ్యది తగన్ దా హూణుగాఁ జేయునో*
*వరశోభాకర మట్టి హూణకల నే వర్ణింపఁగా శక్యమే?"*

ఇంగ్లీషు విద్య నీచకులాలవారికీ లభిస్తున్నదని, బిచ్చగాళ్ళకు కూడా అందుబాటులో ఉందని, అది భారతీయులను పాశ్చాత్యులుగా మారుస్తున్నదనీ దుఃఖిస్తూనే, ఆ విద్యలో విద్యార్థులకు ఆసనసౌకర్యం, ఆటపాటలు, ఉత్తీర్ణత వల్ల లాభం ఉన్నాయని పేర్కొన్నారు. నిజానికి సాంప్రదాయిక వేదవిద్యలో గూడా నారసపరీక్ష, నింబపరీక్ష వంటివి లేకపోలేదు. అయితే ఉత్తీర్ణత అందులో ప్రధానం కాదు; అది ఉపాధి కల్పించేదీ కాదు. అదే భేదం. విద్యార్జనకు కొంత డబ్బు వెచ్చించవలసిరావటం ఇంగిలీషు విద్యావిధానంలోని లొసుగని కవులు వేలెత్తి చూపారు.

ఆంగ్లేయులు స్థాపించిన న్యాయస్థానాల్లో వకీళ్ల ప్రవర్తనను గురించి ఆనాడు తిరుపతి వేంకటకవులు చెప్పిన పద్యం నేటి పరిస్థితులకూ అద్దంపట్టుంది. (అందుకే కోర్టులను బహిష్కరించాలని జాతీయకాంగ్రెసు పిలుపిచ్చింది. గరిమెళ్ళ సత్యనారాయణ వంటివారు గేయరూపంలో ప్రజలను హెచ్చరించారు.) ప్లీడర్లను గురించిన చెప్పిన పద్యం -

"గెలియనట్టిదియైన గెల్చునటంచును, లాఁ జూచి కల్పనలను ఘటించి
తప్పుఁ జెప్పుమటన్నఁ దప్పుఁ జెప్పనివారి, నోటి కబద్ధాలు నూరిపోసి
జెడ్జిగారికి నేను జెప్పుమాటలు పథ్య, ములు సుమా యని వాని మోసపుచ్చి
రేపు ఫీ జిచ్చెద మా పిచ్చెద నటన్నఁ, గాదు తెమ్మని ముందుగానె కొనియు
వ్యాజ్య మొకవేళఁ బోయిన వాని సాక్షి, మీఁద నెపమిడి, గెల్చిన మీఁదఁ బెట్టు
కొని నటింతురు ప్లీడరుల్ గొంద ఱిలను, న్యాయవాదుల మంచు నన్యాయలీల."

ఇటువంటి అభిప్రాయాలు వీరేశలింగం, గురజాడ వగైరాల రచనల్లోనూ కనిపిస్తాయి. విధవావివాహ కార్యక్రమంలో వీరేశలింగం ప్రయత్నాలను గురించి వీరు కూడా అవధానాల్లో ప్రస్తావించారు :

"...అన్నిఁటికి నోర్చి విధవలౌ నంగనలకు
'భ్రూణహత్యలు జరగక పోవుఁగాక'
యంచుఁ బెండ్లిండ్లు సేయ యత్నించుచుండెఁ
గందుకూరి వీరేశలింగ ప్రధాని"

వీరేశలింగంగారు విధవావివాహాలను సమర్థిస్తూ చెప్పిన అనేక కారణాలను, వాదనలను విడిచిపెట్టి ఏకదేశంగా భ్రూణహత్యా నివారణ కనటంలో కవులకున్న సదభిప్రాయ మేపాటిదో తెలుస్తుంది. అలాగే ఆసంస్కరణను గురించిన ప్రసంగాలకు కాలక్రమాన వ్యతిరేకత తగ్గుతున్నదని కూడా గమనించవచ్చు.

క్రీ.శ. 19వ శతాబ్దం చివరికే భారతదేశంలోనేగాక ప్రపంచవ్యాప్తంగా ఆర్థికసంక్షోభం తెచ్చిపెట్టిన ఆర్బత్‌నాట్ కంపెనీ విషయాన్ని జంటకవు లిలా విశదీకరించారు :

ఉద్యోగములు చేసి యూళ్ళనెల్లను దోచి, యార్జించినట్టి ద్రవ్యంబు కొంత
హూము లన్నిఁటి నమ్మి పొలఁతుల నగ లమ్మి, సమకూర్చినట్టి విత్త మదికొంత
వ్యవసాయములు చేసి వర్తకమ్ము లొనర్చి, కైకొన్నయట్టి రొక్కమ్ము కొంత
పెల్లికైనను భిక్షపెట్ట కార్జించిన, వసుమతీశ్వరుల ద్రవ్యంబు కొంత
దేశదేశమ్ములకుఁబోయి తిరిపమెత్తి, యార్జనము చేసికొన్న ద్రవ్యంబు కొంత
'ఆరుబతునాటు' హరియించె నౌర! వీరి, క్షౌరమున కీడువచ్చెడి క్షౌరమున్నె?"

910 నాటికే మ్యునిసిపల్ ఎన్నికలు అమల్లోకి వచ్చాయి. అభ్యర్థుల తీరునూ ఎన్నికల ా ఆక్షేపిస్తూ చిలకమర్తి ప్రహసనం కూడా రాశాడు. కాకినాడ ఎన్నికల గురించి వులు చేసిన వివరణ ఇది :

" 'ఓటర్ల' భయపెట్టి చాటు లంచములిచ్చి, సభ్యతాపదవి కాసపడువారు
అధికారు లగువారి యాశ్రయబలమున, 'మెంబరీషిప్పు' కామించువారు
సభకు విగ్రహపుష్టి సలుపుచు యజమానుఁ, డేది చెప్పినఁ జేతు లెత్తువారు
చదువుసందెలు రాక పదిమందిలోఁ దలఁ, ద్రిప్పికోఁగోరి యత్నించువారు
సభ్యతాపద మాశించు సమయమందుఁ, దప్పఁ దమవీధి చూడని ధన్యతములు
నీకు మెంబర్లు కాకుండఁ గాకినాడ, 'మ్యునిసిపల్' సంఘమా! వృద్ధి నెనయుమమ్మ!"

భారతీయ సంప్రదాయ చరిత్రకుగాని సంఘపరిణామక్రమానికి గాని సంబంధంలేని తీయ భావన ప్రజాస్వామ్యం. దీన్ని ఇంగ్లీషువాళ్ళు మనదేశంలో ఆచరణకు పెట్టినప్పటి చి ఈనాటివరకు ఎన్నికలు జరుగుతున్న తీరులో పై పద్యంలో చెప్పిన లక్షణాలకు ద్ధంగా జరిగిందేమీలేదని, జరుగుతుందనే ఆశ కూడా లేదని గుర్తించవచ్చు.

వీరేశలింగం రాకకుముందే తెలుగులో కొన్ని గద్య/వచన రచనలు వచ్చినా, ఆయనే ్వయెత్తున వచనరచనలకు శ్రీకారం చుట్టినవాడు. 'గద్యకవిబ్రహ్మ' అని ఆయన్నే స్తావించేవారు. అందాకా పద్యకవితకూ కవులకూ తిరుగులేకుండేది. సంప్రదాయవాదులు ద్యకవితను ఎంత తక్కువగా చూసేవారో కింద పేర్కొంటున్న తిరుపతి వేంకటకవుల ద్యాలు నిరూపిస్తాయి. (నాటకరచనల్లో పద్యగేయా లుండవచ్చా లేదా అనే వివాదం కూడా కాలంలో దుమారం లేపింది. పద్యం ఉండరాదన్న పానుగంటి లక్ష్మీనరసింహారావు వంటివారే ము చెప్పిన నియమాన్ని పాటించకపోవటం వేరు సంగతి) :

"గద్యము పద్యగౌరవము గాంచదు; బ్రహ్మరథంబు పట్ట రే
గద్యకవిత్వచాతురికి...

"కుక్షింభరులో స్వాక్షా, ద్భిక్షాధికులో మతెట్టి పేదలొ పద్యం
బక్షీణగతినిఁ జెప్పెడి, దీక్షితులే మేటికవులు...

"తద్దినముఁ బెట్టువారల తమ్ములవలెఁ
బద్దెపుం గవులకు వెన్క గద్దెపుఁ గవు
లుంద్రు, స్త్రీశూద్రజనులకు నుపకరింత్రు
వారు పిట్టకతలు చెప్పువారు గాఁగ.

"పద్యకవి గద్యకవి యౌట బట్టు; గద్య
కవికిఁ బద్యము గట్టుట గాదు సుళువు."

స్త్రీశూద్రులకు వేదవిద్య తగదన్న మనుసంతతికీ గద్యరచనలను ఈసడించ
స్వభావాదర్శాల్లో భేదం కనిపించదు. 1915లో భారతభూమికి తిరిగివచ్చిన మోః
కరంచంద్ గాంధీ అవతారపురుషుడని భావించే జనం అసంఖ్యాకంగా పెరు
సమయంలో, ఈ జంటకవులు 'గాంధీఋషి' అనే ఖండికలో చెప్పిన పద్యార్ధ మిది

"ఏ యెండకు నాగొడుగును
ధీయుక్తి నెఱుంగు నా సుధీమణి గాంధీ!"

## మంగిపూడివారి విచారం

భారత రాజకీయాల్లో 1915లోనే గాంధీజీ ప్రవేశించినా, ఆయన నిలదొక్కుకొనే
1919లో రౌలత్‌చట్టం వచ్చింది. ఆలీసోదరులూ (మహమ్మద్ ఆలీ, షౌకత్ ఆలీ), మౌ
అబుల్ కలాం ఆజాద్‌లు లేవదీసిన ఖిలాఫత్ ఉద్యమాన్ని ఆయన బలపరిచాడు. ఆ
జలియన్‌వాలా బాగ్‌లో భారతపౌరుల ఊచకోత జరిగింది - జనరల్ డయ్యర్ ఆధిపత్య
మాంటేగ్-ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణల ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వం పరిమిత ప్రాంతీయాధి
భారతీయుల కిస్తానంది. 1920లో సహాయనిరాకరణోద్యమం, విదేశీవస్తుబహిష్కరణ,
పాఠశాలలనుంచి దేశభక్త విద్యార్థులు బయటకురావటం, హిందూ సమాజంలో అస్పృ
నివారణ ప్రయత్నాల వంటివి మొదలయినాయి. గాంధీ హరిజనభావన గుజరాతీకవి
మెహతా నుంచి వచ్చింది. కానీ 1915లోనే తెలుగువారికి అస్పృశ్యతా వ్యతిరేకత ఉందన
మంగిపూడి వేంకటశర్మ (1882-1951) రాసిన 'నిరుద్ధభారతము' సాక్ష్యమిస్తుంది :

"మాల లని పంచము లటంచు మాదిగ లని
శ్వపచు లని చెప్పగారానివా రటంచు
మఱియుఁ జండాలు రని తోడి మానవులను
దరిమివేయుట సాంఘికధర్మ మగునె?"

వేంకటశర్మ 1907లో 'వందేమాతరము', 1908లో 'బాలవితంతువిలాపము'
గ్రంథాలు రాసినవాడు.

## ఉమర్ ఆలీ షా కవి సాక్ష్యాలు

తననాటి ఆంధ్రసమాజస్థితిని వర్ణించిన మరో మహాకవి ఉమర్ ఆలీషా (1885-1945). ఆయన బహుకాలం వైస్రాయి కౌన్సిల్లో సభ్యుడిగా ఉంటూ ప్రత్యేకాంధ్రరాష్ట్రం కావాలనే బయ్యా నరసింహేశ్వరశర్మను సమర్థిస్తూ వాదించిన నిర్భయుడు. ఆయన 1919లో రచించిన 'క్షామదేవత' నాటి సమాజదుస్థితిని వివరిస్తుంది :

"ఆరంభమయ్యె మా కార్తుతునాటి ది,వాలాకె నిఱుపేద వాలకంబు
మఱుసటి యేడె బీమాకంపెనీలు మా, యిల్లువాకిలిని నట్టేటఁ గలిపె
యుద్ధంబు పేర్చెప్పి యున్నమట్టున కుత్త, మర్ణు లార్పిరి మచ్చ మాపినట్లు
వర్షాలులేక మా వరిచేలు పండక, సిస్తులకై యున్న యాస్తి పోయె
ఇట్లు కొనయూపిరికి వచ్చునట్లు చేసి
గాలివానకుఁబడు చెట్లవోలె మమ్ముఁ
జేసినావు దరిద్రాగ్నిఁ ద్రోసినావు
క్షామదేవత! వదలు దేశంబు నడచి.

"ఔమ్మనకున్ బవల్నిశలు ఔకలి కట్టుక దంపు దంచి జీ
వమ్ములు నిల్పువార లొకవంకను ధాన్యము లేక బాష్పవ
ర్షమ్ములు నింప; ధాన్యపు మరల్ పనిలేకయె బూజువట్టి మే
ఘమ్ములఁ జూచుచున్న విఁకఁ గార్యము లేదని క్షామదేవతా!...

"... రిలీఫు సొసైటులవారి బాధలున్
బాసిన నెట్టులో బ్రతుకవచ్చును దీనత క్షామదేవతా!...

"... బియ్య మమ్మ కం
ట్రోలున కేగి దేహి యని రూక యొసంగిన బేడ కంటె రాఁ
జాలవు బియ్య మంచు, నొక జాము దినార్ధమొ యున్నదానికిన్
సోలెఁడు గింజలే యొసఁగుచున్నవి...

"...సెట్టి తవ్వకోలయందున లాభముఁదీసి నోటు నూ
ర్కమ్మనఁ గానిఁ దీసి జవరాలి కమర్చును నానుపేట...

"...పేదవాండ్రని తలంపక వారల కాసువీసముల్
లాగిరి కంటురోలునకు లాభము సేయఁగ...

"పరదేశంబుల వస్తువుల్ ప్రియము కావచ్చున్; మహాయుద్ధముల్
పరవాసంబులఁ గాల్పవచ్చు; నవి మాపైఁ గట్టి, మా ధాన్యమున్

బరరాజ్యంబుల కంపి, మా వసువులున్ బంగారమున్ బోవ దు
ష్కరదుర్భిక్షదవాగ్ని ముంచఁదగునే?...
"మధురాన్నములు మాని మహనీయు లందఱు, దోసె యుప్మాలకు దాసులైరి
శతవర్షజీవులు శల్యగతప్రాణు లకట! కాఫీ గత ప్రాణులైరి
ఎళనీరు ద్రావి హాయిగ సుఖించెడు వార, లైసు సోడాలకు నర్థు లైరి
కర్పూరతాంబూలముల ఖాదను లగువారు, ఖారఖిల్లీల సర్దారు లైరి
మంచి పెసరట్టు, సిగరెట్టు మనకు రెండె
పంపె స్వర్గంబునుండి యీశ్వరుఁ డటంచుఁ
బలికి కొఱమాలి నినుఁ గోరి పిలిచినాము
గాని, లేకున్న నీవు రాఁగలవె కఱవ?"

ఆయనే ప్రత్యేకించి 'కాఫీ'ని గురించి రాసిన పద్యాలు :

"కాంత లేకున్న మానె నేకాలమందు
కాఫి యుండినఁ జాలు, దుఃఖంబు లేదు...
"కల్లులోని నురుగు కాఫిలో వేడిని, నూదుకొనుచుఁ ద్రావుచుండవలయుఁ
గాని, కాఫికున్న గౌరవ మ్మల కల్లు, కాచనందువలనఁ గలగలేదు!"

నేరుగా ప్రభుత్వాన్ని దూషించకుండా క్షామదేవతమీద నెపంపెట్టి దేశీయస్థితిని పై పద్యాలు వివరించాయి. అందులో ప్రస్తావనకు వచ్చిన విషయాల్లో మొదటిది ఆర్బత్‌నాట్ (కంపెనీ) దివాలా విషయం. తిరుపతి వేంకటకవుల ప్రస్తావన ఇంతకు ముందే గమనించాం. 1846 ప్రాంతాల్లోనే పాలకొల్లు ప్రాంతంలో పత్తి, చెరకు పంటలకు మదుపుపెట్టిన ఆర్బత్‌నాట్ కంపెనీ, ఇతర సర్కారు ప్రాంతాల్లో నీలిమందు (Indigo) వగైరా వాణిజ్యపంటలను కూడా ప్రోత్సహించింది. ప్రపంచవ్యాప్తంగా ఆ కంపెనీవారు విస్తరించి చేసిన వ్యాపారాలు దివాలాదీశాయి. లక్షలమంది మధ్యతరగతి పౌరులు నష్టపోయారు. దానికే ఆర్బత్‌నాట్ క్రాష్ అనేపేరు వచ్చింది. ఈ దివాలా వ్యవహారం ఒక్కో ప్రాంతంలో ఒక్కోసారి జరిగింది కాబట్టి స్పష్టంగా ఈ సమయంలో జరిగిందని చెప్పటం కుదరదు. పిఠాపురం ప్రాంతంలో ఆర్బత్‌నాట్ దివాలా తీసిన మరుసటేడే (ఈ కాలం 1919 లోపుగానే జరిగి ఉండాలి - గ్రంథప్రచురణ కాలానికి ముందే) బీమా కంపెనీలు దివాలా తీశాయి. ఎంపైర్ ఇండియా ఇన్స్యూరెన్సు కంపెనీ వంటి వనేకం అప్పట్లో మూతపడ్డాయి. కవి వేటిని స్పష్టంగా ఉద్దేశించాడో చెప్పలేం. బ్రిటిష్‌వారి సామ్రాజ్యవిస్తరణ అప్పటి కాగిపోయినా, పరిపాలనభారం శిరోభార మవుతున్న సమయ మది. కవి ప్రస్తావించిన (మహా)యుద్ధం మొదటి ప్రపంచయుద్ధం 1914-1918 మధ్యకాలంలో జరిగింది. అది భారతభూమి మీద జరగనేలేదు. కాని దాని పేరిట ఇక్కడి ధనధాన్యాలను సేనల అవసరాలకోసం విదేశాలకు తరలించారు. ఫలితం ఇక్కడ కరువు, కష్టాలు.

1919కు ముందే ధాన్యంనుంచి బియ్యం వేరుచేసే మరలు (మెషిన్లు) దిగుమతి అయినాయి - అవి దంపుడు బియ్యం స్థానంలో మరబియ్యాన్ని సిద్ధంచేసేవి. ఈ బియ్యాన్ని ప్రభుత్వ నియంత్రణలో ఉన్న దుకాణాల్లో నిలవచేసి కుటుంబాని కింత అనే లెక్కప్రకారం అమ్మేవాళ్లు. సామాన్యజనం వాటిని 'రేషన్‌షాపు'లంటే (ration shops) ప్రభుత్వం వాటినే 'సహాయకసంఘాలు' (relief societies) అని వ్యవహరించేది. చేసింది నియంత్రణ (control); పిలిచింది ఉపశమన/సహాయ సౌకర్యమని. అందులోనూ రూకకు (రూపాయకు) బేడ (రెండణాలు, రూపాయలో ఎనిమిదో వంతు) వరకు మాత్రమే ఏడిపించి ఇచ్చేవారు. పైనుంచి దిగుమతి అయిన కాఫీ, ఐసు (మంచుగడ్డ), సోడా, కారాకిళ్ళీ (కవి ఖారఖిల్లీ అన్నాడు), సిగరెట్ల మీద వ్యామోహం పెరిగింది జనాలకు. సిగరెట్టును ప్రస్తావించిన తొలి తెలుగుకవి ఉమర్ ఆలీషాయే ననిపిస్తుంది. కాఫీ భయంకర వ్యసనమయిందని, కల్లును మించిపోయిందని కవి చాలా బాధపడ్డాడు. ఐసు, సోడాలు ఎళనీరు (లేత కొబ్బరిపాలు) కన్నా ఎక్కువ గౌరవప్రదమై పోయినందుకు చింతించాడు. ఎటొచ్చీ దోసె, ఉప్మా, పెసరట్లను గురించిన ఆయన ప్రస్తావన సహజభోజనాలకన్నా చిరుతిండ్లమీదనే మోజు పెరుగుతున్నదనటానికి సూచన ఏమో ననిపిస్తుంది - వంటకాలన్నీ దేశవాళీవే కాబట్టి.

ఇందులో మరికొన్ని విశేషాలు ఈ కాలంవాళ్ళు తెలుసుకోవలసి ఉంది. బేడకు సోలెడు (మర) బియ్యం అమ్ముతున్నారంటే 'రూక'కు (రూపాయికి) రెండు మానికలు/అడ్డెడు బియ్యమన్నమాట. అప్పటి (రొక్క) రూపాయి వెండిది. బేడ సత్తుది. బేడకు రెండణాలు, అణాకు నాలుగు కానులు/కాణీలు. (రెండో ప్రపంచయుద్ధంలో చిల్లికాణీలు వచ్చాయి - లోహం శాతం తగ్గించటానికి). కాణీకి మూడు దమ్మిడీలు. దమ్మిడీకి రెండు ఠోలీలు. ఈ రచయిత ఠోలీలను చూడలేదుగాని, విన్నాడు; అవి వాడుకలో లేకపోయినా ఆ విలువకు సరుకు దొరికేది. దమ్మిడీ ఇచ్చి ఠోలీకి నూకలు, మరో ఠోలీకి ఉప్పు, చింతపండు వగైరా లిమ్మని అడిగి కొనటం కద్దు. అణాలున్న రోజుల్లో నూటికి నూరు శాతం అనే అర్థంలో పదహారణాల ఆంధ్రులుండేవారు. (బహుశా మేలిమి బంగారం వన్నెను ఈ సందర్భంలో స్మరించవలసి వుంటుంది.) చౌకబారు అనటానికి అణాకాణీ సరుకనేవాళ్ళు. సెట్టి నోటుకు కాణీ మిగుల్చుకొనేవాడంటే 64వ వంతు లాభం గుంజేవాడన్నమాట - తప్పుడు తూకంతో కాదు - కొలతతో. తవ్వుకోల అనేది కొలపాత్ర. కాసువీసాలు తూకానికి సంబంధించిన బరువులు. ఈ రచనలో ఈ పదబంధానికి 'ఏ కొద్దిభాగమో' అనే అర్థం సరిపోవచ్చు.

## ఆంధ్రరత్న చాటుపద్యాలు

అలనాటి సంఘస్థితిగతులకన్నా దాన్ని నడిపిస్తున్న రాజకీయ పరిస్థితులనే ప్రముఖంగా భావిస్తూ అధిక్షేపహాస్యప్రసంగాలుగా పద్యరచన చేసినవాడు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (1889-1928). ఒక్కసారిగా తారాజువ్వలాగా భారతీయ రాజకీయాకాశంలో మిన్నంది, కొద్దికాలంలోనే బ్రిటిష్ పార్లమెంటును కదిలించిన సంఘటనలకు సూత్రధారిగా

ఉండి, అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శియై, కార్యదర్శి ఉన్నచోటనే కార్యాలయం ఉండాలని వాదించి నెగ్గి దాన్ని బెజవాడకు తరలించగలిగిన సమర్థుడు. ఆయనకు ముందుగాని, తరవాతగాని కార్యస్థానాన్ని కదిలించిన మరో నాయకుడు లేడు. 1921లో చీరాల-పేరాల వనవాసం సాధించిన స్థితప్రజ్ఞుడు. 'అభినయదర్పణాన్ని' సంస్కృతంనుంచి ఇంగ్లీషులోకి అనువదించి ఆనందకుమారస్వామి అంతటివాడికి సాయపడిన విద్వాంసుడు. చమత్కారి. మహావక్త. సంగీతంలో జనాకర్షణ సాధించిన సరసుడు. ఆయన గతించినప్పుడు బసవరాజు అప్పారావు 'ఏమని పాడేది యమునాకల్యాణి?' అని విలపించటానికి కారకుడు. 1919-25 సంవత్సరాల మధ్యకాలంలో జరిగిన ఆంధ్రమహాసభలకు అధ్యక్షత వహించిన వారిని గురించి ఆయన (బహుశా) 1925లో చెప్పిన పద్యం :

> *"బయ్య నరసిమ్మయ్య బ్రహ్మలోకాన్నుండె, న్యాపతి సుబ్బన్న చూపు తగ్గె*
> *పానుగంటివిభుండు ప్రథమప్రధానియై, ప్రభులచెంతనుజేరి యొదిగియుండె*
> *మోచర్ల రామన్న ఖేచరుండై యుండె, కే.వి. కృష్ణారావు కీర్తి మిగిలె*
> *పట్టాభి సీతన్న గుట్టుగా కాలంబు, 'జన్మభూమి'నిఁజేరి జరుపుచుండె*
> *వీరలందరు <u>మాడరేట్స్</u>దీవార, లాంధ్రసభ మున్ను నేలి రత్యాదరమున*
> *నేఁడు మన పాలఁబడియెను నిశ్చయముగ, రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"*

సర్ బయ్యా నరసింహేశ్వరశర్మ వైస్రాయి కౌన్సిల్లో సభ్యుడు. 1913లో బాపట్లలో జరిగిన మొదటి ఆంధ్రమహాసభకు అధ్యక్షుడు. న్యాపతి సుబ్బారావు మేధావి, వకీలు, కొంతకాలం కౌన్సిల్ సభ్యుడు. పానగల్ రాజా (పానుగంటివిభుడు) జస్టిస్ పార్టీ నాయకుడుగా ఉండి ఉమ్మడి మదరాసు రాష్ట్రానికి మొదటి ముఖ్యమంత్రి అయినవాడు. అప్పట్లో ముఖ్యమంత్రిని 'ప్రీమియర్' అని వ్యవహరించేవాళ్లు. ఆయన కాంగ్రెస్ వ్యతిరేకి, బ్రిటిష్ అభిమాని. కాబట్టి రాష్ట్రసాధన విషయం పట్టించుకోలే దాతరవాత. మోచర్ల రామన్న పూర్తి పేరు రామచంద్రరావు. ఆయన మదనమోహన మాలవ్యా దివంగతుడైన తరవాత కాంగ్రెసు మితవాదులు నెలకొల్పిన లిబరల్ పార్టీకి రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రి తరవాత అధ్యక్షుడై జాతీయస్థాయి నాయకుడైనందువల్ల 'ఖేచరు'డయినాడు (ఆకాశంలో విమానయానం చేస్తున్నందువల్ల). కే.వి. కృష్ణారావు పోలవరం జమీన్‌దారు. ఈ పద్యం రాసేనాటికి కీర్తిశేషుడైనాడు. పట్టాభి సీతన్న భోగరాజు పట్టాభిసీతారామయ్య. దరిమిలా 'రాష్ట్రపతి' (స్వాతంత్ర్యానికిపూర్వం అఖిలభారత కాంగ్రెసు పార్టీ అధ్యక్షుణ్ని ఇలా పిలిచేవాళ్ళు) అయినవాడు. ఆయన 'జన్మభూమి' అనే దినపత్రికను పెట్టి గుట్టుగా కాలం వెళ్ళదీస్తున్నారట. 'గుట్టుగా' ఎందుకంటే ఆయన ప్రధానాకాంక్ష టంగుటూరి ప్రకాశాన్ని దెబ్బతీయటం కాబట్టి. వీళ్లంతా 'మాడరేట్లు'. అంటే కాంగ్రెసులోని మితవాదవర్గంవాళ్లు. (లాలా లజపతిరాయ్, బాల గంగాధర తిలక్, బిపిన్ చంద్ర పాల్ అనే ముగ్గురూ అతివాదవర్గం నేతలు. వారిని లాల్-బాల్-పాల్ అని క్లుప్తంగా వ్యవహరించేవాళ్లు.) 1920లో మహానందిలో జరిగిన

ఆంధ్రమహాసభకు హాజరైన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను (ముఖ్యంగా పట్టాభివర్గానికి చెందిన) బందరునుంచి వచ్చిన ప్రతినిధులు 'సుంకర కొండాయ' అని వెక్కిరించారు. తనది శంకరుడి అవతారమని గుర్తించమని హెచ్చరిస్తూ అప్పుడు దుగ్గిరాల చెప్పిన పద్య మిది :

*"బింకాలు పలుకు బందరు, కుంకల ఛీంకార మెల్లఁ గీడ్వడఁ జేయన్*
*శంకరుఁడె మహానందిని, సుంకర కొండాయ యాయెఁ, జోద్యం బేలా?"*

పన్నెండు సంవత్సరాలపాటు వార్షిక మహాసభలయితే నిర్వహించగలిగారు గాని, పైన పేర్కొన్న పెద్దలు ఆంధ్రరాష్ట్రం సాధించలేకపోయారని ఆక్షేపిస్తూ, ఇప్పు డా కార్యభారం మనపాలబడిందని దుగ్గిరాల శ్రీరాముడికి విన్నవించాడన్నమాట. ఈ పద్యరచనాకాలం 1925 కావచ్చు.

**1921** - కాంగ్రెసు చరిత్రలోనూ ఆంధ్రుల చరిత్రలోను అత్యంత ప్రధానమైన సంవత్సరం. ఆయేడు ఆంధ్రరత్న నాయకత్వంలో తమ గ్రామాలను మ్యునిసిపాలిటీగా కలపటాన్ని వ్యతిరేకించిన చీరాల-పేరాల పౌరులు ఊరు వదిలిపెట్టి ఆరుబయట కొంతకాలం, గుడిసెలు వేసుకొని కూడా పన్నులు చెల్లించకుండా కొంతకాలం సహాయనిరాకరణం చేశారు - **1920** నాటి కాంగ్రెసుపార్టీ నిర్ణయం ప్రకారం. ఆ సంవత్సరమే పల్నాడులో పుల్లరి చెల్లించటానికి నిరాకరించిన ప్రజలు ఉన్నవ లక్ష్మీనారాయణగారి నాయకత్వంలో జైళ్ళకు వెళ్ళారు. అలా వెళ్ళినవారిలో వావిలాల రామశాస్త్రిగారి కుటుంబం మొత్తం ఉంది. అప్పటికి వారందరిలోకీ చిన్నవాడు వావిలాల గోపాలకృష్ణయ్య. అదే సంవత్సరం పెదనందిపాడులోనూ తీవ్రంగా జరిగింది సహాయనిరాకరణం. ఇవి అత్యంత తీవ్రచర్యలని బ్రిటిష్ పార్లమెంటులోనే చర్చలు జరిగాయి. ఫలితంగా నాయకులందరూ జైళ్ల పాలయినారు. ఈ వివరాలను గాంధీకవి తుమ్మల సీతారామమూర్తి చౌదరి విపులంగా వర్ణించారు. గుంటూరు మండల సర్వస్వంలో ఆరచన పునర్ముద్రిత మయింది. కారాగృహవాసంనుంచి తిరిగివచ్చిన దుగ్గిరాలను 'ఆంధ్రరత్న'మని కీర్తించారు జనం. ఆయన తన తరవాత సహాయనిరాకరణోద్యమం నిర్వహించటానికి అబ్బూరి రామకృష్ణరావును నియమించాడు. కానీ జస్టిస్ పార్టీవాళ్లు ఊరిబయటి పూరిపాకలను తగలబెట్టించిన తరవాత విధిలేని పరిస్థితిలో జనం తమతమ సొంత ఇళ్లకు చేరారు. ఉద్యమం విఫలమయింది. జైలునుంచి వచ్చిన దుగ్గిరాల అప్పుడు తనను గురించి చెప్పుకున్న పద్యమిది :

*"వేదాంతములతోడ వెక్కిరింతలతోడ, లెక్చర్లు సాగించు లీల నెవఁడు*
*లక్ష్య మొక్కటి లేక యక్షగానములతో, కాలంబు వృథపుచ్చు ఘనుఁ డెవండు*
*చీరాలపేరాల చిన్నిగ్రామంబుల, దోసమెన్నక కొంపదీసె నెవఁడు*
*ఆంధ్రరత్నం బంచు నధమపక్షము సుంక్ర, కొండఁడై యరికోటిఁ జెండు నెవఁడు*
*అట్టి గోపాలకృష్ణుని హాస్యసరళి, గోలకృష్ణునిఁగాఁ జేసి కొంటఁతఁ దీర్చెఁ*
*గాక పగ్గము లుండునే 'గాడ్డుకైన, రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"*

1922లో గాంధీ సత్యాగ్రహసమరం ఆరంభించాడు బార్డోలీలో. రెచ్చిపోయిన జనం చౌరాచోరీలో హింసకు ఒడిగట్టారు. బ్రిటిష్ ప్రభుత్వం నాయకులను నిర్బంధించింది. వాళ్ళు ఎలా ప్రతిస్పందించాలో తేలక అయోమయంలో పడ్డారు. హిందూముస్లిం సంఘర్షణలు మొదలు కావటంతో ఖిలాఫత్ ఉద్యమాన్ని ఉపసంహరించారు. మరోవైపు భిన్నప్రాంతాల్లో రైతుసంఘాలు ఏర్పడటం మొదలయింది. 1923లో మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్ అనే ఇద్దరు పెద్దలూ బ్రిటిష్ ప్రభుత్వంవారి కౌన్సిళ్లలో చేరి అక్కడే న్యాయమార్గంలో పోరాడాలని వాదించారు. గాంధీ వగైరా లందుకు సమ్మతించలేదు. మోతీలాల్ నెహ్రూ 'స్వరాజ్యపార్టీ' అనే కొత్త పార్టీని స్థాపించాడు. దానికి ప్రధానకార్యదర్శిగా పనిచేయమని తనను ఆహ్వానించాడని గోపాలకృష్ణయ్య అనుచరులతో చెప్పినా, నమ్మలే దందరూ. ఆ సమయంలో దేశనాయకుల దీనస్థితిని అపహసిస్తూ ఆంధ్రరత్న చెప్పిన పద్యమిది :

*"గాంధిదేవుని రాక కంచుఢక్కలఁ గాక, కరతాళశబ్దాల దరువుఁ గోరె*
*దేశబంధుని దశల్ దివసాలతోఁ దీరె, రాజగోపలచారి బూజువట్టె*
*కొండెంకటప్పన్న ఉండిలేకుండెను, భాయిపటేళ్లు నిర్భాగ్యులైరి*
*లాల లజపత్రాయి కోలుపోయెను శ్రద్ధ, చండి సరోజిని వండిపోయె*
*ఆలీలు గోళీలఁ గేళిసవాల్ మాని, ఖాళీగ తాలీల పాలఁబడిరి*
*జమ్నలాలూసెట్టి తుమ్మవీముంబట్టి, ఖద్దర్దుకాణంబు సర్దుచుండె*
*మొదటి తాకిడి కింతటి మోసమయ్యె, ఖ్యాతి కొక్కడు నిల్చె మా మోతిలాలు*
*ముందు గతు లెట్టులౌనొ! ఖామందువీవు, రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"*

తన పద్యానికి తానే వ్యాఖ్యానం చెప్తూ గాంధీని "పురుషోత్తముఁ డనుకొన్నాను, ఉత్తమ పురుషుఁ డయినాడు" అన్నాడట గోపాలకృష్ణయ్య. అంటే దేవుడనుకొన్నానుగాని తన సంగతి చూసుకొనే (తాను-ఉత్తమపురుష. అని వ్యాకరణం) మంచిమనిషి అనిపించాడన్నమాట. స్వాతంత్ర్యసమరంలో గెలిచి ఢక్కానాదం చేస్తాడనుకొంటే చప్పట్లు కొట్టించుకొని సంతృప్తి పడుతున్నాడని ఆక్షేపణ. 'దేశబంధు'వంటే చిత్తరంజన దాసు. ఆయన స్వరాజ్యపార్టీ స్థాపనకు అంగీకరించి కూడా సొంతపనుల్లో మునిగిపోయాడు. (ఆయనేకాదు, నేను కూడా సి.ఆర్. దాసునే - చీరాల రామదాసు - ననేవాడట ఆంధ్రరత్న.) రాజగోపాలాచారి ఉలుకూపలుకూ లేకుండా మౌనముద్రలో ఉన్నాడు. ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడయిన కొండా వెంకటప్పయ్య ఉన్నాడని అనిపించటం లేదు - నిష్క్రియతవల్ల. విఠల్‌భాయి పటేల్, వల్లభ్‌భాయి పటేల్ ఇద్దరూ చేతగానివాళ్ళయినారు. (వల్లభ్‌భాయినే తరవాతికాలంలో 'ఉక్కుమనిషి' అని కీర్తించారు - స్వదేశ సంస్థానాలను చాలామటుకు స్వతంత్రభారతంలో కలిపివేశాడని). ఒకనాటి అతివాద నాయకుడు లాలా లజపతిరాయ్ తన మాట వినేవాళ్లు లేక శ్రద్ధ కోల్పోయాడని సానుభూతి. కవయిత్రి సరోజినీ నాయుడు కోపగత్తేకాని ముసలితనంవల్ల సర్దుకపోతున్నది. షౌకత్ ఆలీ, మహమ్మద్ ఆలీ అనే సోదరులు ఖిలాఫత్ ఉద్యమాన్ని ఉపసంహరించిన తరవాత

ఇతర వ్యాపకాల్లో పడ్డారు. సేఠ్ జమాన్‌లాల్ బజాజ్ దేశవ్యాప్తంగా ఖద్దరు దుకాణాలు పెట్టించటంలో తలమునకలయినాడు. ఒక్క మోతీలాల్ మాత్రమే ఏదో ఒక తీరున పోరాటం చేయాలను కుంటున్నాడు. తరవాతి కర్తవ్యమేమో దేవుడే చెప్పాలంటాడు "రామదాసు"నని చెప్పుకునే ఆంధ్రరత్న.

స్వాతంత్ర్యోద్యమంలో చేసిన తప్పులకు పశ్చాత్తాపపడుతూ హింసారహితంగా దేశ మంతటా ఉద్యమం నడపాలనే సిద్ధాంతప్రవచనం కన్నా వేదాంతమార్గంలో 'ఆత్మార్పణం' చేయటానికే సిద్ధపడి గాంధీజీ నిరాహారదీక్ష చేపట్టాడు 1924లో ఢిల్లీలో. ఆ సందర్భాన్ని వివరిస్తూ దుగ్గిరాల రాసిన పద్యం:

> "వాదవైఖరిఁ దోలి వేదాంతరతిఁ దేలి, స్వారాజ్యసారంబుఁ జేరుకొఱకు
> వ్యవహారనయ సమన్వయ భవ్యమార్గ మా, సేత్యాగస్థలిఁ బ్రతిష్ఠించుకొఱకు
> హింసాపథాగతధ్వంసియౌ ధర్మంపు, వంశం బహింసచే వర్ధిలుటకు
> లోకకళ్యాణమ్ము చేకూర్ప నాత్మార్పణమ్మను నార్షపథమ్ముఁ దుదకుఁ
> బూనినాఁడు మహాత్ముఁడు భూభరమ్ముఁ, బాపఁగా నేఁడు మహదుపవాసవ్రతము
> ముక్తిసుముహూర్తవేళలు మూఁగినవిఁక, రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"

గాంధీ తలపెట్టి మొదలుపెట్టిన ఆమరణనిరాహారదీక్షతో అటు స్వరాజ్యమో ఇటు (ఆయనకు) స్వారాజ్యమో (అంటే స్వర్గమో) వస్తుందని ఆంధ్రరత్న విశ్వసించాడు. ఆ రెండూ జరగలేదు. 1928లో సైమన్ కమిషన్ భారతపర్యటనకు వచ్చేదాకా స్వాతంత్ర్యసమరం స్తబ్ధుగా సాగింది.

బందరులో జాతీయ కళాశాల వెలసింది. అందులోనూ చిత్రకళాచార్యుడుగా బెంగాలీ చిత్రకారుడు అవనీంద్రనాథ్ ఛటర్జీ ప్రభావమే సాగింది. తెలుగువాళ్ళు చిత్రకళలో ప్రపంచ ప్రఖ్యాతి సాధిస్తున్నారుగాని అందులో దేశీయతాముద్ర తక్కువగా ఉందని ఆంధ్రరత్న దుఃఖించాడు. పాశ్చాత్యుల మెప్పు ప్రధానమైపోతున్నందుకు బాధపడ్డాడు. భారతీయ చిత్రకళకు తగినంత గుర్తింపు రావటం లేదని బాధపడ్డాడు. 1925లో దామెర్ల రామారావు కన్నుమూసిన తరవాత, ఆయనకు స్మారకచిహ్నంగా రాజమహేంద్రవరంలో 'రామారావు ఆర్ట్ గ్యాలరీ' అనే చిత్రశాలను నిర్మించారు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ఆంధ్రరత్న రాసిన పద్యం :

> "దామెర్ల రాముణ్ణి సీమలో మెచ్చారు, యెంకిపాటలు నింగి కెక్కుచుండె
> వంగవాసి ఛటర్జి నింగిలీషు కజిన్సు, మెచ్చి గ్రంథాల్ వ్రాసి యచ్చువేసె
> కవుతరయ్య కుమాళ్లు ఖండాంతరంబుల, గొప్పగొప్పోళ్లంచు గోలపుట్టె
> అడవి బాపడి పేరు పడలే దదింకాను, పడుతుంది దొరలలోఁ బడిన యపుడు
> కళలు పుట్టెను తెలుఁగుల గడ్డలోన, ననుచు 'క్రిటికులు' ఘోషింతు, రవునుగాని

*మనకు మాత్రము గన్పింపమానెనేమొ!, రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"*

దామెర్ల రామారావు పేరిట చిత్రకళాభవనం కడ్తే బాగుండేదిగాని పాశ్చాత్యభాషా సంస్కృతుల ననుకరిస్తూ పేరుపెట్టడం తగదని, అతడి చిత్రాల్లో భారతీయత తక్కువనీ ఆంధ్రరత్న విమర్శ. ఆ చిత్రాలను బెంగాలీవాడయిన ప్రమోద్‌కుమార్ ఛటర్జీ (బాపిరాజు గారి గురువు) మెచ్చుకున్నా, ఇంగ్లీషువాడయిన జేమ్స్ హెచ్. కజిన్స్ (James H. Cousins) అనే విమర్శకుడు ప్రస్తుతించినా, తెలుగువాళ్లు మెచ్చలేదని ఆయన భావం. కవుతరయ్యె అంటే కౌతా శ్రీరామశాస్త్రి. ఆయన 'శారద' పత్రిక సంపాదకుడు కూడా. ఆయన కుమారులు రామమోహనశాస్త్రి, ఆనందమోహనశాస్త్రి. వాళ్లు లండనులో చిత్రకళ అభ్యసించినందువల్ల ఖండాంతర కీర్తి సంపాదించారు. అప్పట్లో అడివిబాపిరాజు (కూడా ప్రమోద్‌కుమార్ శిష్యుడై) బందరు జాతీయ కళాశాలలో ఉపాధ్యక్షుడుగా ఉండేవాడు. అతడికి పేరు రాకపోవటానికి కారణం 'దొరలలోఁబడకపోవట'మని వ్యాఖ్యానం. దొరల దృష్టికి రాకపోవటమో దొరలకు లొంగిపోవటమో స్పష్టంగా తెలియని శ్లేషలో ఈ మాటలన్నాడు. ఈ మెచ్చిన వాళ్ళందరూ 'క్రిటికు' (critics) లేగాని విమర్శకులు కాదనటంలో ఆంగ్ల సంస్కృతి నేర్చినవారేగాని భారతీయ సంప్రదాయం తెలిసినవాళ్లు కాదని భావం. అలా అనగల సాహసానికి కారణం దుగ్గిరాల ఆ కాలంలో జగత్ప్రసిద్ధుడైన కళారాధకవిమర్శకుడైన ఆనందకుమారస్వామికి శిష్యుడూ మిత్రుడూ కావటం (వారిద్దరూ 'అభినయదర్పణ'మనే సంస్కృతగ్రంథాన్ని జంట రచయితలుగా ఆంగ్లీకరించారు). అందువల్ల కేవల హాస్యానికిగాక అభిప్రాయభేదంతోనే ఈ మాటలన్నట్లు గుర్తించాలి. ఇక నండూరి సుబ్బారావు ఎంకిపాటలు ఇంగ్లీషువాళ్లు 'realistic poetry' అనే జానపద శృంగారరచన కాబట్టి అభారతీయం, అశాస్త్రీయమని ఆయన దృఢ విశ్వాసం. అందుకే ఎంకిపాటలను గ్రామ్యోక్తులతో నిందిస్తూ తాను రాసిన పాటను బహిరంగ సభల్లో కూడా పాడి సాధ్యమయినంతగా అప్రతిష్ఠపాలుచేయాలని ప్రయత్నించాడుగాని, అది వినోదమనే భావంతో ప్రజలు ఆనందించారేగాని తప్పని ఈసడించుకోలేదు! ఆంధ్రరత్న వైఫల్యాల్లో ఇదొకటి.

"ఆంధ్రవాణీ విలాప"మని ఆయన రాసిన మరో పద్యం నాటి కవుల దీనస్థితిని, పాశ్చాత్య వ్యామోహాన్ని, తెలుగు సరస్వతికి జరుగుతున్న అపచారాన్ని, దానికి గాంధీ కూడా తోడ్పడటాన్ని ఎత్తిచూపుతుంది. ఆ పద్యం కూడా 1925 ప్రాంతాల్లో రాసిందే. అది ఇది :

*"రామలింగారెడ్డి సీమరాజుల షెరీక్, చేరి నన్ బొందంగఁ గోరుచుండె*
*గంధికోమటి నన్ను హిందిచే నెట్టించి, బందిలోఁ బెట్టంగఁ బంపుచుండె*
*పండితుం డనువాఁడు తిండికై వెండికై, చండాలుకడనైన నుండుచుండె*
*కొతిమేరుకవిగాళ్ళ గతు లయోమయములై, నన్ను వీధినిఁబెట్ట నెన్నుచుండె*
*అకట! దిక్కెవ్వ రింక నా కవనియందు, ననుచు నేడ్చుచునున్నది యాంధ్రవాణి*

*నీదు కోడలి మానంబు నిలుపవయ్య, రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"*

కట్టమంచి రామలింగారెడ్డి జస్టిస్ పార్టీ నాయకుడు కాబట్టి ఇంగ్లీషు ప్రభుత్వానికి మిత్రుడు. అతడు అర్థశాస్త్రం రాసీ, కవిత్వతత్త్వవిచారం రాసీ - అదీన్నీ తెలుగులో - నన్ను 'పొందాలని' (తాను బ్రహ్మచారి కాబట్టి అనుభవించాలని) కోరుతున్నాడనేది అభియోగం. గాంధీజీ తన హిందూస్తానీ వ్యామోహంతో తెలుగుకు సముచితస్థానం కల్పించటం లేదు - తాను భారతీయుడైనా. హిందుస్తానీ అనేది భారతీయమైన హిందీ పర్షియన్/ఉర్దూ భాషల సంకరం కాబట్టి స్వచ్ఛంకాదని ఆక్షేపణ. పండితులు ఉద్యోగాలకోసం ఇంగ్లీషువారి (చండాలుర) సేవలు చేస్తున్నారని నింద. కొతిమేరు కవిగాళ్ళన్నది ఆయన 'భావకవులకు' (lyrical poets కు) పెట్టిన పేరు. మహాకావ్యాలు మహావృక్షాల్లాంటివి. భావకవుల ఖండకావ్యాలు కొతిమేరకట్టల్లా వాసనలు చిమ్మినా త్వరగా వాడిపోయి అంతరించేవి. జగన్నాథపండిత రాయలు సామాన్య కవులను ఉప్పుకోసం, కూరకోసం రాసేవాళ్లని (శాకాయ వా స్యాత్ లవణాయ వా స్యాత్) ఆక్షేపించిన తీరులో సాగింది విమర్శ.★ రాయప్రోలు సుబ్బారావు తన కవితను కూడా తిట్టి ఎంకిపాటలకు కల్పించిన ప్రాచుర్యం కల్పించమని అడిగితే జాంగ్రీలో ఆవకాయ నంచుకున్నట్లో, ఆవకాయలో జాంగ్రీని కలిపినట్లో ఉందిలే పొమ్మని తిట్టి, పద్యం కూడా రాయలేదనే ప్రవాదముంది. తెలుగుకవిత ఇంగ్లీషు, హిందీల ప్రభావంతో స్వతంత్రత పోగొట్టుకొంటున్నదని ఆయన దుఃఖం.

తరవాతి కాలంలో వేలూరి శివరామశాస్త్రి (1892-1967) 'తెలుగు దుర్గతిని' ఇదే విధంగా ఎత్తిచూపి విచారించాడు, ప్రశ్నించాడు :

*"తెలివికి సంస్కృతమో మఱి, కలిమికి నాంగ్లేయమో యిఁకం దురకంబో*
*విలువయిడి నేర్చి నీయీ, తెలుఁ గెవ్వరి పాలు చేసి తిరిగెద వాంధ్రా?"*

నాటికీ నేటికీ తెలుగు పరిస్థితిలో పెద్దమార్పు రాలేదనీ, వస్తే అది మరింత దీనదశకు రావటంలోనే నని చెప్పవచ్చు.

సమకాలంలోని ఆంధ్రనాయకులగురించి ఆంధ్రరత్న చెప్పిన చాటువుల్లో నాటి సంఘవిశేషాలు తెలుస్తాయి. కాశీనాథుని నాగేశ్వరరావును (1867-1938) గురించి చెప్పిన పద్యంలో కొన్ని విశేషాలు లేకపోలేదు. ఆ పద్యం -

"ఆంధ్రపత్రికతోడ నమృతాంజనం బిచ్చి, తలనొప్పిఁ బాపెడు ధన్యుఁ డెవఁడు
లక్షలాదిగ డబ్బు దీక్షతో సమకూర్చి, భిక్షుకోటినిఁ గాచు దక్షుఁ డెవఁడు
ప్రతి కాన్ఫరెన్సును గతి నీవె యని వేడ, ప్రెసిడెంటుగా నేలు రసికుఁ డెవఁడు
మితవాదహితుఁ డౌచు నతివాదగతుఁ డౌచు, నందు నిందును లేని మందుఁ డెవఁడు

★ "ఎవియొ అర్థమ్ముగాని భావగీతంబు"లని దేవులపల్లి కృష్ణశాస్త్రి అంతటి భావకవే అంగీకరించినందున, అది 'అయోమయ' కవిత్వమని ఆక్షేపించా డన్నమాట.

*అట్టి కాశినాథుని నాగయాహ్వాయుండు, పుట్టకుండిన నాంధ్రంబు పుట్టి మునిఁగి*
*గిట్టకుండునె యేనాఁడొ యట్టి నీల్గి? రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!*

విలియం కంపెనీవారి మందులను ప్రచారం చేయటానికి బొంబాయిలో ఆంధ్రపత్రిక **1907**లో మొదలయింది. ఆ మందుల్లో ముఖ్యమయింది అమృతాంజనం. ఆ పత్రిక **1908** నుంచి మదరాసుకు మారి వారపత్రికగా వెలువడేది. **1914** నుంచి ప్రపంచ యుద్ధవార్తలను కూడా అందించేందుకు దినపత్రికగా మారింది. అది కాశీనాథుని అంతటి కాంగ్రెసునాయకుడి దయినా, బ్రిటిష్ ప్రభుత్వాన్ని విమర్శించినందుకు ఒక్కసారి కూడా ధరావతు చెల్లించలేదంటే ఎంత సౌమ్యంగా, జాగ్రతగా నడిచిందో ఊహించవలసిందే! (చివరకు చాలా సనాతన భావాలున్న హిందూపత్రిక కూడా ఒకటిరెండుసార్లు ప్రభుత్వక్రోధానికి గురయింది). ఆ పత్రికను చదువుతుంటే పుట్టే తలనొప్పిని పోగొట్టేందుకే అమృతాంజనం తయారుచేశాడనటం విపరీతారోపణ. ఆయనకు 'విశ్వదాత, దేశోద్ధారకుడు' అనే బిరుదులు రావటానికి కారణం ఆయన రాజకీయసభలక్కూడా అంతో ఇంతో దానమివ్వటం, సభాధ్యక్షత వహించటం, విమర్శలు తీవ్రంగా సాగకుండా జాగ్రతపడటంకోసం అని సూచన. పత్రికను ఆయన జీవించి ఉన్నంతకాలం ప్రతి గ్రంథాలయానికీ ఉచితంగా సరఫరా చేశాడు. అలా మరెవ్వరూ ఈనాటికీ చేయ(టం) లేదు. కాంగ్రెసులోని రెండువర్గాలవారికీ సమానదూరంలో ఉన్నందు వల్ల ఎవరివైపూ మొగ్గలేదు. అదో అసిధారావ్రతంలాంటి చర్య. ఈయన్నే మరోసారి 'నాగేశ్వరుడు వట్టి నాగజెము' డని వర్ణించాడు గోపాలకృష్ణయ్య!

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం గురించి *"టంగుటూరి ప్రకాశ 'మింగె' వచ్చిన దాది, 'డింగి' ఫీవరుతోడఁ గ్రుంగిపోయె"* నన్నాడు. సమయం, అర్థం స్పష్టంగా తెలీదు. మరోసారి 'టంగుటూరి ప్రకాశ మింగిలీషు పిశాచి' అన్నాడు. బహుశా ఇంగ్లీషులో 'స్వరాజ్య' పత్రికను నడుపుతున్నాడని కావచ్చు. ఆయన స్వభావాన్ని మరింత వివరిస్తూ చెప్పిన సీసపద్య మిది :

*"అరవవాగ్వ్యాపార మచ్చుఁ దానొత్తుచు, మలయాళ భగవతిఁ గొలుచు నెవఁడు*
*అగ్నిసాక్షిగఁ గొన్న యంబుజాక్షిని వీడి, ధనయశఃకాంతలఁ దగిలె నెవఁడు*
*ఆంధ్రకాంగ్రెసు సభాధ్యక్షతఁ జేఁబూని, భారతావని నేలఁగోరు నెవఁడు*
*లోకసంగ్రహదీక్షఁ బ్రాకి పైకెక్కి తా, 'స్వారాజ్య' మందంగఁ గోరు నెవఁడు*
*కాలభైరవ భీకరోగ్రానల ప్ర, కాశమూర్తియై క్రాలు ప్రకాశమూర్తి*
*కలుగ దేశాని కింకేమి గలుగు కొదువ?, రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"*

స్వరాజ్యపత్రికకు పెట్టుబడి అరవదేశంనుంచి వచ్చింది. దానికి యజమాని ప్రకాశమే గాని, సంపాదకుడు కె.ఎం. ఫణిక్కర్ అనే మలయాళీ. బారిష్టరుగా కోట్లు సంపాదించిన ప్రకాశం ఆ సొమ్మును పార్టీకి దానమిచ్చి పేరు సంపాదించాడు. ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షత కన్న దేశస్థాయి పదవు లపేక్షించలేదుగాని, మొత్తం దేశనాయకులు తన చెప్పుచేతల్లో ఉండా

లనుకొనేవాడు. గాంధీ తనకన్నా ఎనిమిదేళ్లు చిన్న కాబట్టి ఆయన నాయకత్వం ప్రకాశానికి నచ్చేదికాదు. అలాగే చిన్నవాడైన జవహర్‌లాలును ఏకవచనంలోనే పిలిచేవాడు. 'స్వరాజ్యం' సాధిస్తే తనకు 'స్వారాజ్యం' (స్వర్గం) దొరికినంత సంతోషించే తత్త్వమాయనది. ఎవరినీ దేన్నీ లక్ష్యపెట్టని ధైర్యం ఆయన సొత్తు. (ఈ పద్యరచననాటికి సైమన్ కమిషన్ రావటం, ప్రకాశం తుపాకిగుండ్లకు ఎదుర్రొమ్ము చూపటం జరగలేదు గాని, ప్రకాశం స్వభావాన్ని ఆంధ్రరత్న ముందే గ్రహించాడు.

సంప్రదాయవాది అయిన దుగ్గిరాలకు సర్వేపల్లి రాధాకృష్ణ చదువుసంధ్యలు నచ్చలేదు. ఒక అసంపూర్ణ పద్యంలో -

*"అమెరికా ఖండాని కద్వైతమును దెల్పి, తత్త్వశాస్త్రచరిత్రఁ దగ లిఖించి*
*వంగవిద్యాలయ రంగమందు నటించి, బొక్కుఫిలాసఫీ ప్రొఫెసరు వయి*
*ఆక్స్‌ఫర్డు నందలి యవధూతలకు నెల్ల, వేదాంతమును గొంత వేడ్కఁ దెలిపి..."*

అని ప్రస్తావించాడు. ఆయన పుస్తకాల పురుగే గాని మన మహర్షుల్లాగా, వివేకానందలాగా తపస్సు చేసినవాడుకాదు, సంస్కృతజ్ఞానమున్నవాడూ కాడని దుగ్గిరాలకు తక్కువచూపు. అవధూతల్లేని ఆక్స్‌ఫర్డులో కాబట్టి రాధాకృష్ణ వేదాంతం చెప్పగలిగాడని, కలకత్తా విశ్వవిద్యాలయంలో ఆయన పెద్ద తాత్త్వికుడుగా 'నటించా'డనీ ఆక్షేపణ. తాను ఎడింబరోలో చదువుకొని వచ్చినా పాశ్చాత్యసంస్కృతి లేశాన్ని ఆయన సహించినట్లు లేదు. అందుకే బాపట్లలో "శివదివాణముకాడ 'సినిమ' నాట్యమ్మాడ, సంధ్యానటన వీడు సాంబశివుఁడు" అని బాధపడ్డాడు! దుగ్గిరాల మరణసమయానికి టాకీలు రాలేదు కాబట్టి, ఈ ప్రస్తావనలో నిది 'మూకీ' సినిమా అయి ఉంటుంది. తన సమకాలంలోని విద్యావతులయిన స్త్రీల వేషభాషలను ఆక్షేపిస్తూ ఆయన రాసిన పద్యం ఇది (దీనికి వ్యాఖ్యాన మనవసరం) :

*"ప్రక్కకు పాపిళ్ళు నిక్కిన ముక్కోళ్ళు, వాడిపోయిన మోము బీడుకళ్ళు*
*ఎండిపోయిన చళ్ళు పండిపోయిన ముళ్ళు, కాళ్ళకు మేజోళ్ళు కళ్ళజోళ్లు*
*మళ్ళుగట్టిన జుట్టు ముళ్ళుపెట్టిన కట్టు, నక్కి గుట్టినబట్ట నడుము తట్ట*
*సందుచేసిన చంక కందిపోయిన డొంక, పలుచఁబాఱిన తొడ పలకల మెడ*
*గూనిరెక్కలు చుక్కానిలేని వాణి, పసిఁడి పళ్ళను కుళ్ళిన ముసలిపెదవి*
*చదువు మోపైన చానల చందమౌర! రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!"*

## కాఫీ దండకం, టీ, సిగరెట్, కిళ్ళీల సేవనం

1919 నాటికే కాఫీ వాడుక పెరిగి అది వ్యసనంగా పరిణమించింది తెలుగుదేశంలో. దాని తీవ్రతను పోకూరి కాశీపతి (1892-1974) అనే విద్వత్కవి తాపీ ధర్మారావు కోరిక మీద మదరాసు ఆంధ్రమహాసభలో ఆశువుగా వర్ణించాడు - దండకరూపంలో. అందులో నుంచి కొంతభాగం ఉద్ధరించినా ఆ వ్యసనతీవ్రతను గ్రహించవచ్చు.

*శ్రీమన్మహాదేవి! లోకేశ్వరీ! కాళికాసన్నిభాకారిణీ! లోకసంచారిణీ! అంబ! కాఫీ జగన్మోహినీ!... నీ యింపు, నీ సొంపు, నీ పెంపు వర్ణింప నేనెంతవాఁడన్? ధనాకర్షిణీ! ప్రాణసంరక్షిణీ! ధాత్రి నెవ్వారలేన్ వేకువన్ లేచియున్ నిత్యకృత్యంబులన్ దీర్చి మున్ముందుగా నిన్నుఁ బానంబు గావింపకున్నన్ - ద్విజుల్ వేదమంత్రంబులన్ బల్కఁగా లేరు, ప్రాంచత్కవుల్ పద్యముల్ హృద్యమౌ రీతి నిర్మింపఁగా లేరు... డ్రైవర్లు స్టీరింగులన్ బట్టఁగా లేరు, టీచర్లు పాఠంబులన్ జెప్పఁగా లేరు, డాక్టర్లు నింజక్షనుల్ జేయఁగా లేరు, ప్లీడర్లు నోరెత్తి వాదింపఁగా లేరు, జడ్జీలు నేస్వల్పమౌ తీర్పులన్ వ్రాయఁగా లేరు, దిట్టంబుగాఁ బాలసుల్ కూటసాక్ష్యంబులన్ జెప్పఁగా లేరు, వారాంగనల్ కోడెగాంఢ్రన్ వెసన్ గేళిలో నోలలాడింపఁగా లేరు... పోకూరి కాశీపతి స్వాంతరాజీవ సంవాసినీ! నీకిఁకన్ మంగళంబౌ మహాకాఫిదేవీ! నమస్తే నమస్తే నమస్తే నమః".*
(సంప్రదాయకవి నోట ఎన్ని ఇంగ్లీషు మాటలు వెలువడ్డాయో గుర్తించండి.)

మొదట గింజలు తెచ్చి వేయించి పొడి చేయవలసి వచ్చేది. కాఫీపొడి తయారు చేయడానికి చిన్నమర మార్కెట్టులోకి వచ్చింది. తరవాత కాఫీబిళ్ళలు వచ్చాయి. వాటిని వేడినీటిలో కలిపితే కషాయం తయారయ్యేది. దరిమిలా కాఫీపొడి వచ్చింది అంగళ్ళలోకి. ఆమీదట ఆ పొడికి కలిపే చికోరీపొడి విడిగా వచ్చింది. దాన్ని రకరకాల పాళ్లలో కలిపిన కాఫీపొడి వచ్చింది. ఇప్పుడు తక్షణం కాఫీ చేసుకొనేందుకు మెత్తని చూర్ణం వచ్చింది. ఏయే రూపాల్లో కాఫీ ఎప్పటినుంచి అందుబాటులోకి వచ్చిందో స్పష్టంగా తెలియదు. టీ/తేనీరు దరిమిలా వాడుకలోకి వచ్చిన పానీయం. దానిమీద పాతకాలంలో ప్రత్యేకంగా పద్యాలు చెప్పారేమోగాని అవి దొరకలేదు. కాఫీ, సిగరెట్టు - అందులోనూ కత్తెరమార్కు (సిజర్సు) - సిగరెట్ల మీద తెలుగుకవుల మోజు గొప్పది. ఆ రెంటినీ కిళ్ళీతోబాటు, టీతోబాటు సమబుద్ధితో సేవించినవాడు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (1914-68) అని పెద్దలు - అందులోనూ చుట్టమీద ప్రేమగల కాటూరి వేంకటేశ్వరరావు (1895-1962) రాసిన 'సిజర్సు శిరోమణి' నుంచి సాక్ష్యం లభిస్తుంది (టీ మీద కాటూరివారి పద్యమే ప్రాచీనతరమేమో) :

> *"చుళుకీకృత కాఫీ టీ*
> *జలనిధి! ఖిల్లీ సహస్రచర్వణచణ! ని*
> *ర్మలధూమోజ్జ్వల పరివే*
> *షలసన్మూర్తీ! సిజర్సు సారజ్ఞమణీ!"*

తాంబూలచర్వణం అతిప్రాచీనమేగాని కారాకిళ్ళీ అనేది ఉత్తర హిందూస్థానంనుంచి తెలుగుదేశానికి బహుశా ఇరవయ్యో శతాబ్ది రెండో దశాబ్దిలో దండెత్తి వచ్చిందంటారు. అందుకు స్పష్టమైన నిదర్శనలు సాహిత్యంలో దొరకలేదు. ఖారాఖిళ్ళీని మొదట పేర్కొన్నది ఉమర్ ఆలీ షా కవి, తెలిసినంతలో.

## జాషువా చూసి చెప్పిన సమాజ దుస్థితి

రాజకీయ సామాజిక రంగాల్లో గాంధీ ప్రభావం క్రమంగా పెరుగుతున్న సమయంలోనే, హరిజనోద్యమం బలపడుతున్న కాలంలోనే, తెలుగు సాహితీరంగంలో మూడు ప్రధాన లక్షణాలు పరిస్ఫుటంగా కనిపిస్తాయి. వాటిలో మొదటిది భావకవితాధోరణి. అది పద్యరూపం నుంచి గేయరూపంలోకి మారుతున్నదేగాని - సమాజంతో సంబంధం పెట్టుకోని ఊహామయజగత్తులో ప్రణయోన్మాదంలో కొట్టుమిట్టాడటమనే తొలిగుణం మారలేదు. రెండోది అవధాన కవిత. ఇది పద్యరూపంలో ఉండేది ప్రాయికంగా. అవధానుల వేషధారణ, కవితాధోరణి వేగవంతంగా ఉండటం, సాధారణంగా జమీన్దారుల, వారు పోషిస్తున్న పండితకవుల అభిరుచులకు అనుగుణంగా ఉండేది. మొదట స్నేహభావంతో ఉన్న రెండు జంటల కవులు 1911 నాటికి బ్రాహ్మణుల్లోని శాఖాభేదాలకు చిహ్నంగా మారి శత్రువులై ఒకరినొకరు దూషించుకుంటూ తిట్టుకవితను అభివృద్ధిలోకి తెచ్చారు. వారిలో మొదటి జంట తిరుపతి వేంకటకవులది (దివాకర్ల తిరుపతిశాస్త్రి : 1872-1919; చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రి : 1870-1950). రెండో జంట కొప్పరపు సోదరకవులది (కొప్పరపు వేంకటసుబ్బరాయశర్మ : 1895-1932; కొప్పరపు వేంకటరమణశర్మ : 1897-1942). మూడోది మూడో దశకంలో బీజప్రాయంగా ఉన్న అభ్యుదయకవితా ధోరణి. ఇది కమ్యూనిజం ప్రభావంతో ఉద్భవించింది. ఈ మూడు ధోరణులూ ఏకకాలంలో మూడుదార్లు తొక్కుతున్న సమయంలో, మొదటిరెండూ బలహీనపడుతున్న కాలంలో, మూడోది నిలదొక్కుకోని సమయంలో పద్యకవితా ధురంధరుడుగా గుర్రం జాషువా (1895-1971) కవితారంగప్రవేశం చేశారు. ఆయనమీద గాంధీ సిద్ధాంతాల ప్రభావం బలీయంగా ఉండేది. తెలుగులో కరుణరస ప్రధానమైన అనేక ఖండకావ్యాలను ఆయన ప్రకటించారు.

అభ్యుదయ కవులకున్న సామాజికస్పృహ ఆయనకూ ఉంది. జాషువా "తొలి నిట్టూర్పు" ఆయన కవితాస్వభావానికి అద్దంపడ్తుంది.

"ప్రణయకవి యొకండు, పాషాణకవి యొక్కఁ, డేడ్పుకవి యొకండు నేకమగుచు
నొండొరులను జూచి యోదార్చుకొనుచున్న, బాగుపడునె భావిభరతజాతి?"

పైవారిలో ప్రణయకవి ఎంకిపాటలు రాసిన నండూరి వేంకటసుబ్బారావు (1895-1957). ఎంకిపాటలు 1925లో వెలుగుచూశాయి. పాషాణకవి విశ్వనాథ సత్యనారాయణ (1895-1976). ఆయన కవిత్వం ఒక పట్టాన కొరుకుడు పడదని, నారికేళపాకంకన్నా కఠినంగా పాషాణపాకంలో ఉంటుందని ప్రతీతి. ఏడ్పుకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897-1980). ఆయన 'కృష్ణపక్షం' మొదలు అనేక కావ్యాల్లో విషాదం - అదీ ప్రణయిని కోసం - పరివ్యాప్తంగా ఉంది. సమాజంలోని కష్టనష్టాలు ఆయనకు పట్టలేదు. ఆ విషయాన్ని ప్రపంచిస్తూ జాషువా -

"చేతన్ గంటముపట్టు నెట్టికవియుం జింతింపఁ డీనాఁడు నీ

భ్రాతృక్లేశము, నీక్షుధార్త భరతాంబా దీర్ఘదారిద్ర్యమున్''

అని బాధపడతాడు. అంతేకాదు -

"ప్రతిమల పెండ్లి చేయుటకు వందలు వేలు వ్యయించుఁగాని దుః
ఖితమతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్ప రీభరతమేదిని..."

అని దుఃఖిస్తాడు. అయినా మన కవుల స్వభావం అంతేగదా అని నిట్టూరుస్తాడు :

"పూఁదోటల మదబంభర, నాదముల విలాసవతుల నడబెడఁగుల నా
హ్లాదించు కవుల కీనిరు, పేదల ఆక్రందనములు వీనులఁబడునా?"

అని ప్రశ్నించుకొని, మార్గనిర్దేశం చేస్తాడు :

"ఎవతుకకోసమో కుమిలి యేడ్చుచు చిక్కని తెల్గుకైత కా
యువులు కుదించి ఏమిటి కయోమయమున్ పొనరింతు వీవు, నీ
కవనము పాడుగాను! వెడగా! ఇక నేనియు రమ్ము దారికిన్..." అని హెచ్చరిస్తాడు.

గుడ్డిలో మెల్లగా సామ్యవాదులకూ నాస్తికులకూ కాస్త దయాగుణముందని సరిపెట్టుకొంటాడు :

"నాస్తికుల సామ్యవాదుల, మస్తిష్కములందు పతితమానవతతికిన్
కాస్త జగా కలదేమో, నాస్తి సుమా కరుణ నేటికాలపు గృతులన్" అని గ్రహించాడు.

రెండో ప్రపంచయుద్ధకాలంలో (1939-45) జర్మనీ నాత్సీయిజాన్ని కట్టడిచేసి కార్మిక కర్షకులకు సాయపడి, ప్రపంచ రాజకీయవ్యవస్థలో పెనుమార్పులు తెచ్చినందుకు సామ్యవాదాన్ని అభినందిస్తాడు :

"కొడవటి టెక్కెమున్ దలకుఁ గూరిచి కార్మికకర్షకాళితో
నడుము బిగించె నీయుగమునం దొక నూతనసామ్యవాద మన్
గడిఁ బడి; దాని దెబ్బకు వికావికలైనది స్వార్థజర్మనీ
జడనిధి, నేటిమారుపు లసంఖ్యము లంచితముల్ విచిత్రముల్".

(కాందిశీకుడు, 1943)

తన కర్తవ్యంగా "వర్ణభేదపుం బీచ మడంచెదన్, కటిక చీకటి వాపెద, వెట్టినమ్మకా, లూడనిబాడ, హస్తమున నూనెద శాతకళాకుఠారమున్" అని ప్రతిజ్ఞచేసి అహింసామార్గాన్నే అవలంబిస్తా నన్నాడు. గాంధీజీ సబర్మతీ ఆశ్రమంలో కొంతకాలముండి, హేతువాదీ నాస్తికుడూ అయిన గోపరాజు రామచంద్రరావుతో వియ్యమందిన జాషువా జీవితాంతం గాంధేయ మార్గంలోనే నడిచాడు.

తాను కవితారంగప్రవేశం చేసిన నాటికి బ్రాహ్మణావధానకవులు చేస్తున్న శాఖా యుద్ధాలను (1911-1920) ఆయన పరిశీలించి వాటి ఫలితాన్ని వివరించాడు తన బాణీలో:

"ధట్టీకట్టి నియోగివైదికకవుల్ తార్సిల్లి రన్యోన్యమున్
జుట్టుంబట్ల కళార్ణవైకవిజిగీషుల్, స్వీయపాండిత్యముల్
గుట్టల్ గుట్టలు క్రుమ్మరించి రలుకన్ గొన్నేడు, లా దెబ్బతో
తిట్టుంగైతలు మారుమ్రోగె సకలాంధ్రిన్ కోటికంఠాలతో".

సమాజంలో అట్టడుగున ఉన్న మాలమాదిగలు అగ్రవర్ణాలు బాధిస్తున్నప్పుడు ఏకంగా ప్రతిఘటించటం మాని, తమలో తాము కలహిస్తున్నారని వారి అనైకమత్యమే వారి అభివృద్ధికి శాపమవుతున్నదనీ చింతిస్తాడు :

"దేవుడొకడు మాకు దేవళంబుల రెండు, దేశ మొకటి మాకు తెగలు రెండు
మాటవరుస కొక్క మత మందుమేగాని, కులసమస్య వద్ద కుమ్ముదుమ్ము"

అని విచారిస్తాడు. "నాల్గుపడగల హైందవనాగరాజు" నీచంగా చూసినా, హరిజనులుగా ఆ మతంలోనే ఉన్నవాళ్లు ఆ బాధలనుంచి బయటపడదామని క్రైస్తవమతం స్వీకరించినా, ఫలితంలో మార్పులేదనీ, మనమందరం సమానులమే నసే క్రైస్తవపాదిరీలు కూడా వారికి దూరంగానే ఉంటున్నారనీ ఆయన పేర్కొంటాడు :

"సోదరులము మన మనుచున్, పాదిరు లందరకు నేర్పి, బ్రతుకున నెడమై
పోదు, రిదే ధర్మంబని, వాదించితి పెక్కుమార్లు భయరహితుడనై"

అని బయటపెట్టాడు. ఈ వాదనల ఫలితంగా జాషువాను క్రైస్తవమతాధికారులు బహిష్కరించారు:

స్త్రీవిద్యనేగాక స్త్రీల రచనలను గూడా ఆహ్వానించాడు జాషువా :

"కాంత మగవారితో చేయిగలపకున్న, తలపనేల యనర్థంబు తప్పదనుచు?
భారతక్షోణి చిత్తంబు కోరగింప, కలము వట్టిన దీనాటి వెలదిమిన్న."

గాంధీజీ హరిజనోద్యమాన్ని ప్రస్తుతిస్తూ జాషువా 1946లో చెప్పిన పద్యమిది :

"నిమ్నజాతుల కన్నీటి నీరదములు, పిడుగులై దేశమును కాల్చివేయు ననుచు
రాట్నమను దుడ్డుకర్ర కరానబూని, దెసల తోలెంచె గుజరాతు ముసలిసెట్టి"

(గబ్బిలం-2)

మహాత్ముడి హత్య జరిగిన తరవాత (1950లో) జాషువా చెప్పిన పద్యం నేటి పరిస్థితిక్కూడా అద్దంపడుతుంది :

"కలకల నవ్వెడి తాతయ, శిలయై కలయై అనంతశిల్పమ్మునకున్
బలమిచ్చి దాటిపోయెను, కులమతభేదములు పుంజుకొని తలయెత్తెన్."

రాజకీయవాదులు "శాసనసభలలో సభ్యతాపదవికై వింతసంస్థలను స్థాపి"స్తున్నారని వివరిస్తూ, *"లోక మెట్లు చన్న నాకేమి యనుకొని, ధనము సేకరించి దాచుకొనుచు, నదను చిక్కెననుచు నభ్యర్థివైతివా?"* అని వారిని నిలవదీస్తున్నాడు. *"కూటికి గుడ్డకున్ ప్రజలు కొంగర పోవుచునుండ నీటుగా, మోటరుబండ్లపై నగదుమూటలతో కలవారి వోటు భిక్షాటన సాగుచున్నయది జాగ్రత! దేశనివాసులార!"* అని హెచ్చరిస్తాడు. *"నేలమీదకాలు నిలువ కంబరవీధి, ఖేచరుల విధాన క్రీడ సలిపి, ప్రజల కొఱకు పాటుబడినాడ నని పల్కు, మంత్రివర్యు లింక మాకు వలదు"* అని వారిని బహిష్కరించమన్నాడు. *"దొడ్డపదవులెక్కి గడ్డిమేసెడివారి, నెత్తిపొడుచు చిత్తవృత్తి నాది"* అని ప్రకటించాడు. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత మూడేళ్ళు గడిచినా దేశపరిస్థితి బాగు పడకపోగా చెడిపోతున్నదంటూ 'నల్లదొరలను' నిగ్గదీస్తాడు : *"రాజ్యపీఠమెక్కి రాజదండము బట్టి, మూడు వత్సరాలు మునిగిపోయె, దొరల రాచరికమె మెరుగయ్యె ననిపించె, మారుపల్కవేల? మంతిరన్న!"* అని. జాషువా కరుణ ఖండాంతర విషాదాలక్కూడా చలించింది. రష్యావారు రాకెట్టులో 'లైకా' అనే కుక్కనుంచి అంతరిక్షంలోని పంపారుగాని అది మరణించింది. అయినా శాస్త్రవిజ్ఞానాభివృద్ధికి అది సాయపడ్డదంటూనే, దానికి కన్నీటినివాళు లిస్తాడు :

> *"ఆకసపు బాటసారీ!, లైకా! నీ మరణ మొక అలంకృతి రష్యా*
> *రాకెట్టు సృష్టి చరితకు, నీకివె మా వేడికంటినీటి నివాళుల్!"*

స్వతంత్ర భారతంలోని రేడియో ప్రసారాలను ఆహ్వానిస్తూనే, పురావైభవ ప్రచారం కన్నా ప్రస్తుత ప్రజాసమస్యలకు ప్రాధాన్యమివ్వాలని కవి సూచిస్తాడు :

> *"రేయి బవలు భారతీయసంస్కృతి పేర, గండశిలలు చూపి కథలు చెప్పి*
> *కటికపేదవాని కడుపులోగల చిచ్చు, గడపగలవె నీవు గగనవాణి?"* అని ప్రశ్నిస్తూ.

జాషువా కవిత్వంలో ప్రధానాంశాలు గాంధీవిధానాల అనుసరణ, కులమతతత్వ రహితమై పేదరికంలేని సమాజనిర్మాణం, సమాజసమస్యలకు కరుణామయదృష్టితో స్పందించే రచనలు కవుల కర్తవ్యమనే ప్రగాఢవాంఛ అనేవి. 1910 నాటికే ఎన్నికల్లో గెలుపుకోసం దుర్మార్గాలు మొదలైనవని పూర్వులు వర్ణించారు గాని అవి నానాటికీ పెరిగి అధికార ధన వ్యామోహంగా పరిణమించాయని, గతవైభవ ప్రస్తావనలు కడుపునింపవని వాదించటం, విమర్శించటం ఆ కవితలోని ప్రత్యేకలక్షణాలు. 1928 నాటి సైమన్ కమిషన్ బహిష్కరణ విషయంగాని, 1929 లాహోర్ కాంగ్రెస్ పిలుపిచ్చిన స్వరాజ్యదీక్షను పురస్కరించుకొని జవహర్‌లాల్ నెహ్రూ జాతీయపతాకాన్ని ఆవిష్కరించటంగాని, ఇర్విన్ వైస్రాయిగా భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి నివ్వటానికి బ్రిటన్ సిద్ధపడటంగాని ఆయన కవిత్వ వస్తువులు కావు. 1930 జనవరి 26 నుంచి దేశవ్యాప్తంగా జరుగుతూ వచ్చిన స్వాతంత్ర్య దినోత్సవాల సంగతికన్నా, ఆయేడే జరిగిన మొదటి గుండ్రబల్ల సమావేశం కన్నా, ఆయన

దృష్టిలో గాంధీజీ నాయకత్వం వహించిన సహాయనిరాకరణోద్యమం - అంతకన్నా ఎక్కువగా ఉప్పు (దండి) సత్యాగ్రహం - ప్రముఖమైనవి. 1931లో జరిగిన రెండో గుండ్రబల్ల సమావేశంగాని, తెలుగుటాకీల ఆరంభంగాని ఆయనకు అంత ముఖ్యమనిపించలేదుగాని, 1933లో వెలువడ్డ 'జయభేరి', 1934లో వెలువడ్డ 'మహాప్రస్థానం' అనే రచనల్లో శ్రీశ్రీ మొదటిసారిగా ప్రచారంలోకి తెచ్చిన సామ్యవాదదృష్టి జాషువాను ఆకర్షించిందనాలి. తాను గేయరచన లారంభించకపోయినా, సంప్రదాయరీతిలో పద్యరచనకే కట్టుబడి ఉన్నా, పద్యకవితకో ఆధునికత్వం, ఊపు, ఊతం, జనాకర్షణ ఆయనే సాధించాడు. జాషువా రచనాకాలంలోనే 1939లో బ్రిటిష్ ప్రభుత్వం ప్రాంతీయ పరిమిత స్వాతంత్ర్యాన్ని ఆమోదించి 15 రాష్ట్రాల్లో ఎన్నికలు జరిపింది. భారత జాతీయ కాంగ్రెసు విజయభేరి మోగించింది గాని, 1938లో గాంధీ జిన్నాల మధ్య వచ్చిన విభేదాలనూ తదితర కారణాలనూ పురస్కరించుకొని కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా చేశాయి. 1940లో జిన్నా ముస్లింలీగులో చేరాడు; నేతాజీ సుభాష్‌చంద్ర బోస్ స్వాతంత్రసాధనకు గాంధీమార్గం అంత ప్రయోజనకరం కాదనీ విదేశీయ సహాయంతోనే అది సాధ్యమనీ భావించి విదేశయాత్రలకు వెళ్ళాడు, రహస్యంగా.

1941లో సోహన్‌సింగ్ జోష్ అజాద్ హింద్ ఫౌజును స్థాపించాడు. 1942లో బోసు సింగపూరులో అజాద్ హింద్ ప్రభుత్వాన్ని జపానువారి సహాయసహకారాలతో స్థాపించాడు. 1942 ఆగస్టు 9వ తేదీన 'క్విట్ ఇండియా ఉద్యమం' మొదలయింది. ప్రముఖ దేశనాయకు లందరూ జైళ్ల పాలైనారు. జయప్రకాశ్ నారాయణ్ రహస్యజీవనం గడుపుతూ ఉద్యమం కొనసాగించాడు. 1943లో భయంకరమైన బెంగాల్ కరువు వచ్చి బ్రిటిష్‌వారిమీద విపరీత ద్వేషం పెంచింది - సరైన సహాయచర్యలు తీసుకోలేదని. రెండో ప్రపంచయుద్ధం జపాన్ లొంగిపోవటంతో ముగిసింది. 1945లో సుబాస్‌చంద్రబోస్ అజాద్ హింద్ సేనలు ఇంగ్లీషు వారికి లొంగిపోయాయి - అండమాన్ ద్వీపాల్లోని పోర్ట్‌బ్లెయిర్లో. 1946 ఫిబ్రవరి 18వ తేదీన బొంబాయి, కరాచీ రేవుల్లో భారతీయ నౌకాదళసభ్యులు తిరుగుబాటు లేవదీశారు. యుద్ధంలో గెలిచినా ఆర్థికంగా, సైనికంగా చితికిపోయిన బ్రిటిష్ ప్రభుత్వం విమానదళాల సాయంతో సుదూర సువిస్తృతభారతదేశాన్ని నియంత్రించగలనన్న నమ్మకం పోగొట్టుకొంది. నౌకామార్గాల క్కూడా పూర్తి ప్రమాదం సంభవించేలోగా స్వాతంత్ర్యం ఇవ్వాలనే నిర్ణయానికి వచ్చి ఢిల్లీలో మధ్యంతర ప్రభుత్వాన్ని నెలకొల్పింది గాని, ముస్లింలీగ్ అందులో చేరలేదు. చిట్టచివరకు భారత జాతీయ కాంగ్రెసు దేశవిభజనకు అంగీకరించింది. 1947 ఆగస్టు 14 అర్ధరాత్రి దాటుతుండగా - అంటే 15వ తేదీన - దేశం స్వతంత్రమయింది. 1946-48 మధ్య నైజాం ప్రభుత్వానికీ రజాకార్లకు వ్యతిరేకంగా తెలంగాణా సాయుధపోరాటం జరిగింది కమ్యూనిస్టుల నాయకత్వంలో. అయినా దేశస్వాతంత్ర్యం వచ్చేనాటికి నైజాం పాలన అంతరించలేదు. స్వతంత్రభారతప్రభుత్వం జరిపిన పోలీసుచర్యవల్ల తెలంగాణా విమోచనం కూడా జరిగింది 1948కి. స్వతంత్ర భారతంలో జరిగిన ప్రప్రథమ కిర్యాతకచర్య 1948 జనవరి 30వ తేదీన ప్రార్థన సమావేశం నిర్వహిస్తున్న గాంధీజీని ఢిల్లీలో మతోన్మాది వినాయక్‌రావ్ గోడ్సే కాల్చి

చంపటం. జాషువా కవిత్వం ఈ వివరాల జోలికి పోలేదుగాని ప్రధాన రాజకీయ సామాజిక సమస్యలను దయనీయంగా వర్ణించింది. రాజకీయాల్లో పెద్దయెత్తున ప్రవేశించిన విస్తరిస్తున్న అవినీతిని ఎండగట్టింది. సామాజిక రుగ్మతలకు స్పందించి ఊహామయజగత్తునుంచి కవిజనానికి విముక్తి ప్రసాదించింది. భావకవిత్వం క్షీణించటానికి అద్వితీయంగా తోడ్పడింది. సామ్యవాదకవితను ప్రోత్సహించి అనుసరించలేదుగాని, సర్వమానవ సమానత్వాన్ని అంత శక్తిమంతంగానూ ప్రతిపాదించి ప్రచారం చేసింది.

## సుందరరామ వామనుడి త్రివిక్రమావతారం

సాంఘికచరిత్ర నిర్మాణానికి పనికివచ్చే పద్యకవిత్వం వెలయించినవారిలో మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి (1895-1950) ఒకడు. ఆయన ప్రధానరచనలు 1945-50 మధ్యకాలంలో చాటువుల రూపంలో వెలువడి గ్రంథస్థమైనాయి. సామాజిక రాజకీయ జీవనాల్లోనూ సాంస్కృతికంగానూ వచ్చిన మార్పు లెన్నిటినో ఆయన ప్రస్తావించాడు. తననాటికి ప్రఖ్యాతులైన వ్యక్తులను గురించి, చట్టాలను గురించి, వృత్తులను గురించి, ప్రపంచ రాజ్యాల పరిస్థితుల గురించి, చివరకు తెలుగుసాహిత్యంలో ప్రసిద్ధమైన గిరీశం వంటి కల్పిత పాత్రను గురించి కూడా ఆయన పద్యాలు రాశాడు. "అంటరాని వాళ్ళెవరంటే మా వెంటరానివాళ్ళే" అన్న ఆయన పాట సుప్రఖ్యాతం. కాఫీపానం ఆబాలవృద్ధం పెద్ద వ్యసనమే అయి పోయిందంటూ సాక్షాత్తు శివుణ్ని కూడా అలవాటు చేసుకొమ్మంటాడు :

"అది నీ కర్మము, మూఁడు కాళ్ళ ముసలయ్యల్ ముండమోపుల్ మొదల్
పెదపెద్దల్ వఱ కెల్లవారలకు కాఫీ లోకమైపోవ, నే
మిది యా చాచిన చేయి చాచినటుగానే యుంచుకున్నా, విఁకన్
బ్రదు కత్యంతము చేదుమేయుకొఱకేనా నీకు శంభయ్యకున్?...

"సరి చేదే వలెనన్న నచ్చము డికాక్షన్ గాని, నీ కట్టు ల
క్కరలే దించుక చేదుచేదుగ ననన్ కాఫీ నాకింతేని శ
ర్కర లేకుండనె యిచ్చు నయ్యు రరకప్ కప్ కాఫి, యా ముండమో
సిరి చేఁజాచుట కింతలోనయిన స్వస్తిం జెప్పు వేంచేసినన్". ('శంభూ' నుంచి)

రాజాజీ ప్రధానిగా ఉండగా ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో పొగాకు వాడకం నిషేధించాలనే ఆలోచనవచ్చినప్పుడు, కారాకిళ్ళీని చట్టం పరిధిలోకి తేగూడదనుకుంటున్నా రనే పుకారు పుట్టింది, 1937లో. ఆ విషయం ప్రస్తావిస్తూ కవి రాసిన పద్యమిది :

"పెట్టితె కుంపటిన్ పొడుము పీలుపుతో పొగ పీల్చుకేనియున్
మట్టము చేయుటో అసలు మానుటయో జరిగించుకొందు మె
ట్టెట్టొ పొగాకుమాట, యది యేమిటి? నోటను వేయువారి కీ

చట్టమె లేదటందు రిది సత్యమటోయి ప్రధానిపుంగవా?"

రాజాజీ ప్రధానిగా ఉన్న సమయంలో (1937-38) ప్రకాశం రెవిన్యూమంత్రిగా ఉండేవాడు. ఆ సమయంలో దస్తావేజుల్లో వడ్డీ ఎంతని రాసుకున్నా రైతుల దగ్గరినుంచి అర్ధరూపాయి వడ్డీకి మించి తీసుకోవటం న్యాయవిరుద్ధమనే చట్టం చేశారు. అందువల్ల సన్నకారు రైతుల కన్నా మధ్యరకంవాళ్ళూ సంపన్నరైతులూ అప్పుల బాధనుంచి చాలావరకు బయటపడ్డారు. కానీ ప్రభుత్వానికి ఆదాయం తగ్గింది. అందువల్ల లోటుబడ్జెటు ప్రవేశపెట్ట వలసి వచ్చింది. హరిజనుల నుద్ధరిస్తున్నామంటూ వారికి దేవాలయాల్లో ప్రవేశించటానికి అనుమతి ప్రసాదిస్తూ చట్టంచేసి ఉద్యమస్థాయిలో ప్రయత్నించింది ప్రభుత్వం. కానీ ఆ ప్రయత్నం కొనసాగలేదు. ఈ చర్యలన్నీ ఆంధ్రు లడుగుతున్న ప్రత్యేకరాష్ట్రవాంఛను పక్కదారి పట్టించా యంటాడు కవి :

"డెట్టు రిలీఫ్గ దెచ్చితి, బడీ ల్మనిపించితి పెట్టుబళ్ళనుం
బుట్టుదలల్ సమూలముగఁబో; ఇఁక నే డెఫిసిట్టుతోడి బ
డ్జెట్టులె యాయె నెల్లపుడు, టెంపులు యెంట్రసునేని నెత్తికిం
జుట్టితి, రాష్ట్రభిక్షకయి సున్నను జుట్టిన నేమి మాకిఁకన్?"

'debt relief act, deficit budject, temple entrance' అనే పదబంధాలను తెలుగు లిపిలో రాసిన కవి 'తలనుం బుల్మెదు సత్తుగఁ గ్రొత్త పన్నులన్' అని ఆక్షేపిస్తూ "బకనాసిఁ జేసితివి మంత్రిత్వమ్ము సైతమ్ము, మా దశకుం దగ్గటులే లభించితివిగా! దచ్చాది యాచారిగా!" అంటాడు. 'దచ్చాది ఆచారి' అంటే దక్షిణాదివాడైన రాజగోపాలాచార్యులు.

పేదలు నిరుపేద లవుతున్నారని గ్రహించమనీ మీ అధికారానికీ ఐశ్వర్యానికీ వాళ్ళ శ్రమే కారణమని ఎత్తిచూపుతాడు కవి :

"...అడుగొ నిజుపేద శల్యమాత్రావశిష్టుఁ, డైన ముత్తఁడు ముసలిముద్దయ్యె నెంతొ
నీ హవేలికి నీదు జవాహరీకి, పాప మాతని కష్టమే ప్రాతిపదిక."

బ్రిటిష్వారి రాజ్యంలో 'దత్తమండలా'లనే పేరుతో (ceded districts) భాగమైన ప్రాంతానికి ప్రస్తుతం 'రాయలసీమ' అనే పేరు వచ్చింది, గాడిచర్ల హరిసర్వోత్తమరావు పుణ్యామా అని. ఆ ప్రాంతం 'రాళ్ళసీమ' అని దుఃఖితప్రజలు వ్యవహరిస్తారు, పేదరికాన్ని దృష్టిలో పెట్టుకొని. విజయనగర సామ్రాజ్యం పతనమైన తరవాత పాళెగాళ్లు విజృంభించారు. తమ పరస్పరద్వేషాలతో ఆ ప్రాంతాల్లో నెత్తురుమడుగులు ప్రవహింపజేస్తున్నారు - గడచిన నాలుగు వందల సంవత్సరాలుగా. ఆ దుస్థితిని 'రాయలసీమ' అనే రచనలో కవి ఇలా పేర్కొంటాడు :

"బొగ్గ న్నుగ్గుఁ బొగాకు దుగ్గు సయితంబున్ నిప్పు లేకుండఁగన్
బగ్గుం బగ్గున మండుచున్నయది, ప్రాణం బుండి యీ రీతిగన్

బ్రగ్గం జచ్చుటకన్నఁ జచ్చుటయె కొంతంగొంత మేల్గాదె? యీ
కిగ్గాడీ జగడం బిఁకెప్పటికి శక్తింబాసి శాంతించునో?"

ఆంధ్రనాయకుల గురించి కవి తన అభిప్రాయాలు వివరించిన వైనమిది :

"కొండావారికి నాంధ్రరాష్ట్రమని యొక్కం డుండినం జాలు; నె
వ్వం డర్థింపక విశ్వదాత కెదియున్ బాల్పోదు; తత్త్వజ్ఞుఁడై
గూండాలాగు చరింప నిష్టపడెడున్ గోపాలకృష్ణుండు - వీ
డం డెవ్వండు స్వభావ, మీ జగము చుట్టంజుట్టఁగాఁ గల్గినన్!"

"జంబూరా వలె సాగిపోవలయు వాచా ఏది రాబడ్డ లో
కంబం దెల్లెడ సాంబమూర్తులకు; పాంకం బౌటయేగాక టం
కంబై మాటయు మాట భావ మొక బంగారంబుఁ గావించుచుం
డుం బట్టాభికి - నైజసిద్ధ మిటు లుండుంగాదె నెవ్వారికిన్?"

"ఓర్పే యెందును టంగుటూరి కెదియె ట్లుజ్జ్వాత లూఁగించినన్;
నేర్పే కావలె అయ్యదేవరకు దేనిం బూనినన్గాని; ఓ
దార్పే యెంతకు గొల్లపూడికి విత తత్త్వమ్ము లివ్వానికిన్
మార్పే యుండఁగఁబోదు విశ్వజనసామ్రాజ్యమ్ము చేకూరినన్!"

కొండావారంటే కొండా వెంకటప్పయ్య. ఆయన సాధువు. గాంధీజీకి చాలా సన్నిహితుడు. బహుకాలం ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు పార్టీకి అధ్యక్షుడు. ఆయన్ను గురించి భిన్నసందర్భాల్లో ఆంధ్రరత్న "కొండెంకటప్పన్న గుండుసున్న గదన్న!" అని ఒకసారీ, "కొండెంకటప్పయ్య కొండంత కోపాన చిబ్బుబుబ్బు మటంచుఁ జిందు లేసె"నని వ్యాఖ్యానించిన సందర్భాలేవో స్పష్టంగా తెలీదు. విశ్వదాత అంటే కాశీనాథుని నాగేశ్వరరావు. "నాగేశ్వరుడు వట్టి నాగజెముడు" అని కూడా దుగ్గిరాల వెక్కిరించాడు. "గోపాలకిష్టాయి కొక్కిరాయి" అని తనను గూర్చి తానే చెప్పుకున్న ఆంధ్రరత్న, తత్త్వజ్ఞుడై కూడా గూండాలాగా వ్యవహరిస్తాడని మాధవపెద్ది చెప్తున్నాడు. సాంబమూర్తి అంటే బులుసు సాంబమూర్తి. ఆంధ్రరత్న దృష్టిలో "బులుసు సాంబఁడు వట్టి పుట్టుకుంక". పట్టాభి అంటే భోగరాజు పట్టాభిసీతారామయ్య. ఆంధ్రాబ్యాంక్, ఆంధ్రా ఇన్స్యూరెన్సు కంపెనీ వగైరాలు స్థాపించినవాడు. అఖిల భారత కాంగ్రెసుకు రాష్ట్రపతి (అంటే అధ్యక్షుడు) అయినవాడు. గాంధీజీకి పరమాప్తుడు. సుభాస్‌చంద్ర బోస్‌తో కాంగ్రెసు అధ్యక్షపదవికి పోటీకి నిలబెట్టిన గాంధీజీ 'పట్టాభి ఓటమి నా ఓటమి' అన్నాడు. సదరు పట్టాభి టంగుటూరి ప్రకాశానికి బద్ధవిరోధి అని ప్రజల విశ్వాసం. ఆంధ్రరత్న "పట్టాభి సీతన్న తుట్టెపురుగు గదన్న?" అన్నాడు. టంగుటూరి ప్రకాశాన్ని ఎంతో పొగిడిన ఆంధ్రరత్న స్పష్టంగా తెలియని మరి రెండు సందర్భాల్లో "టంగుటూరి ప్రకాశ మింగిలీషు పిశాచి" అని ఒకమారూ, మరోమారు "టంగుటూరి ప్రకాశ "మింగె" వచ్చిన దాది, "డింగి" ఫీవరు తోడఁ

గ్రుంగిపోయె"ననీ పేర్కొన్నాడు. 1938లో సైమన్ కమిషన్ మదరాసు వచ్చినప్పుడు ధైర్యముంటే నన్ను కాల్చండని గుండెచూపిన ప్రకాశాన్ని జనం 'ఆంధ్రకేసరి' అని పిలిచారు. అయ్యదేవర కాళేశ్వరరావు న్యాయవాది. కొమర్రాజు లక్ష్మణరావుగారితో కలిసి తెలుగు విజ్ఞానచంద్రికా గ్రంథప్రచురణలు కొనసాగించినవాడు. స్వయంగా మంచి రచయిత. ఆంధ్ర రాష్ట్ర మేర్పడినప్పుడు స్పీకరుగా పనిచేసినవాడు. ఆయన నేర్పరి అని మాధవపెద్ది పేర్కొంటుండగా ఆంధ్రరత్న 'అయ్యదేవరవాడు పెయ్యనాకుడుగాడు" అని ఆక్షేపించాడు. గొల్లపూడి సీతారామశాస్త్రి బారిష్టరయినా, గాంధీవిధేయుడై వినయాశ్రమం స్థాపించి రైతు భజనావళి వంటి గ్రంథాలు వెలయించినా, చివరిరోజుల్లో ఆంధ్రరాష్ట్రసాధనకని నిరాహార దీక్షలు సాగిస్తూ మానుతూ చివరకు అప్రతిష్ఠ పాలైనవాడు. 'స్వామీ సీతారాం' అనే పేరు తెచ్చుకున్నవాడు. దుగ్గిరాల "గొల్లపూ డ్సీతన్న కళ్ళులేని కబోది" అని వెక్కిరించాడు. ఇలా మరికొందరినిగురించి చెప్పినా మాధవపెద్ది వారువారు తమ సహజస్వభావాలను మార్చుకోలేరంటే, ఆంధ్రరత్న "తపన లేకున్న నెన్న రీ నెపము లెల్ల" అని ప్రజలు అభిమానంతోనే ఇలా పేర్లుపెట్టారని తన మాటలను సమర్థించుకున్నాడు.

బర్మా (ఇప్పటి మయన్మార్), జపానుల వంటి ప్రాచ్యదేశాలనేగాక ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముందువెనకల్లో ప్రపంచరాజ్యాల పరిస్థితులనుగురించి మాధవపెద్ది అనేక పద్యాలు చెప్పాడు. ఆధునిక నాగరకత పేరిట తెలుగుజాతిలోని మధ్యతరగతివాళ్ళ జీవన విధానంలో వచ్చిన పెనుమార్పులను ఆయన విపులంగా వర్ణించాడు. 'తూర్పుపడమర'లనే ఖండకావ్యంలో ఇలా అంటారు :

> "గదినిండన్ లవ్వుసీను లుండవలెఁ బ్రక్కన్; బై కిఁకన్ సిల్కొ త
> ప్ప దదో పోజుఁట, యుత్తపుణ్యముకె సోఫా నాపసోపాలు, చె
> ప్పెద నింకేమని మాటిమాటికిని కాఫీటీల కైకోళు, లు
> న్నదె పూర్వమ్మున నింత దుర్వ్యయము నల్పాయుష్య మీ తూర్పునన్?..."
> "సరిగా దస్కతె చేతఁగాని క్షపితల్ సన్న్యాసులుం గూడఁ బా
> ర్కరు డ్యూఫోల్డట జేబులం దిడఁగ, లెక్కన్ డొక్క నెన్నేనియున్
> దిరుగుళ్ళన్ దిగఁద్రావఁగాఁగల ముసద్దీ లేని యచ్చోట, వా
> టరుమెన్ ఫౌంటెను పేరులైన వినియుండం బోవ రీనాఁటికిన్..."

"love scences, pose, sofa, coffee, tea; Parker, Dufold, Watermen fountain" అనే వస్తువులను ప్రస్తావించాడు కవి. తానెరిగిన నానావృత్తులకు చెందిన తెనాలి పుర ప్రముఖులనుగురించి అనేక పద్యాలు చెప్పిన మాధవపెద్ది, ఆ పట్టణానికి ఆంధ్రా ప్యారిస్ అనే పేరెంత నప్పిందో ఇలా వివరించాడు :

> "పేటన్ పేటనుగూడ హోటళులు కాఫీహోటళుల్, హోటలున్
> హోటల్లో నునుగూడ ఫోనులును, ఫోనున్ ఫోనునన్ సైతమున్

ట్రైటై టక్కరు టిక్రి గుల్గులుగులక్ టాకీల సంగీతమున్,
రైటోరైటు తెనాలికే తగును లేరా! ఆంధ్ర ప్యారీసనన్."

(coffee) hotels, phones, talky picture music అనేవి సర్వసాధారణంగా పట్టణం లోని ప్రతి ప్రాంతంలోనూ ఉన్నాయన్నవాడు, అక్కడ ముదిరిన ఫ్యాషన్లనూ అందుకు వినియోగపడుతున్న పాశ్చాత్య వస్తుసముదాయాన్నీ ఇలా పేర్కొన్నాడు క్లుప్తంగా :

"కనులన్ జూడదు భార్యయేనియును నీకాలస్థితిం బట్టి జ
ర్మను తైలమ్ము, జపాను స, బ్బమెరికా క్రాపున్, వియన్నా సులో
చనముల్, స్వీడను చేతి బెత్తమును, స్విట్జరైండు రిష్ట్వాచి, ఫా
రెను డ్రెస్, ఫ్రెంచి కటింగు మీసమును, పారిస్ ఫ్యాషనే లేనిచో!"

German hair oil, Japan soap, American haircut/crop, viennese spectacles, Sweedish baton, Swiss wrist watch, foreign dress, French cutting moustache and fashion of Paris - ఇవి లేని భర్త మొఖం కూడా చూడదట భార్య.

పురుషుల నిత్యకృత్యంలో భాగా లేవంటే -

"ఏ పనులు దప్పిననుగాని రేపుమాపు
మా కెనీమా సినీమాల మాట దప్ప,
దేల కడుఁజెప్ప? నేఁటి టాకీలఁ గూర్చి
హస్కుగొట్టఁగ లేని కోన్కిస్క లేడు!"

ఆ పట్టణంలో "పొడుచుకొని వచ్చినవి కుక్కగొడుగులట్లు, స్టూడియోలెన్నో స్థలభాండ శుద్ధి కొఱకు". ఇతర వ్యాపారాలకని వచ్చి నిలదొక్కుకోలేనివారికి "...వల్ల దప్పిన నేమున్నది తారకం బిఁకను కాఫీహోటలో హోటలో" అంటా డాయన. నాగరకతా లక్షణాలు మరికొన్ని:

"ఇటులటుల్ దిరుగాడ నే ఫోర్డుమోటారో, గడపపచ్చనకు నే గ్రామఫోనో
అందమ్ముఁజూడ నే హాలండు నద్దమో, చిత్తం బిగుర్పనే క్రొత్త ఫిల్మో
ఎన్నికం గనఁగ నే టెన్నీసు పందెమో, గొప్పగల్పింప నే గోల్డుఫ్లేకో
కాలంబుఁ గడుప నే క్లబ్బు మెంబరుషిప్పో, యింతయున్ గడువ నే వింత ఫరమో
కలిగినం జాలు నున్న బంగారమెల్ల, నమెరికా ఫ్రాన్సు బ్రిటను దేశములు దోచి
దాచుకొన నేమిలే - కాగితపుఁగరెన్సి, బలిసియున్నది మనకుఁ గావలసినంత..."

"బంగాళిబాబు ధోవతికట్టు సేల మ, య్యంగారి యుత్తరీయంపు మడత
సెల్యులాయిడ్ ఫ్రేము స్పెక్టికల్స్ హాఫ్స్ ఫుల్, స్లిప్పర్సు టాల్బైడోషేపు పెన్సు

వైటు కళ్ళీ షర్టు వన్నె హాండ్ కర్చీపు, రీమోడలు కటింగు రిస్టువాచి
వాకింగుస్టిక్కు నెంబరు వైటు స్మెల్ సిక్కు, పెన్సీ నవల గోల్డుఫ్లేకొ సిజరొ
లేనివాఁ డుండియునుగూడ లేనివాఁడె, యున్నవాఁ డేమిలేకయు నున్నవాఁడె
ప్లీడరైన నెంతటి గొప్ప లీడరైన, డాక్టరైనఁ గొమ్ములు దిర్గు యాక్టరైన..."

"...నడక కొక చందమని లేదు పడకటిల్లొ, కాకయుండినఁ జదువుల గదియొ లేక
రబ్బిషుంగొట్టొ యేదొ నిర్ణయము గాదు, భారతీయుని నిజగృహాభ్యంతరమ్ము..."

"...పార్కులందుఁ బ్రదర్శింపఁబడు నరణ్య, జంతుతతివోలె భారతజాతిగూడ
తా మిగిలియున్నయది ప్రాచ్యతత్త్వవిదు లొ,నర్చు పరిశీలనార్థ మీ నాఁటికేని!..."

పయివన్నీ నూతనైశ్వర్యవంతుల లక్షణాలుగా పట్టణాల్లో ఉండగా పల్లెటూళ్ళ దుస్థితి ఒక పద్యంలో హృదయవిదారకంగా చెప్తాడు మాధవపెద్ది (మన పశుసంపదను కూడా పోగొట్టుకుంటున్నామని విలపిస్తూ) :

"గోవు మాణిక్యముల మాతృదైవతముల, స్వర్ణవాహినితో శతాబ్దముల వారి
నంపుచుంటిమి యెటకొ ఖండాంతరముల, కకట! యెట్టి దరిద్రనారాయణులమొ!"

గురజాడ వేంకట అప్పారావు కొండుభట్టీయంలో, కన్యాశుల్కంలో సృష్టించి ప్రదర్శించిన కల్పితపాత్ర గిరీశం 1897 నుంచి 1950 దాకా ఎందరో నటుల ప్రదర్శనల్లో భాసించి, వాస్తవవ్యక్తిగా ప్రజాహృదయాల్లో నిలిచిపోయాడనటానికి నిదర్శనగా మాధవపెద్ది రాసిన నాలుగు సీసపద్యాల్లో అత్యంత జనాదరణ పొందిన ఒక్క పద్యాన్ని ఉదాహరించవచ్చు :

"గొంగడిపురుగు కట్టింగు మీసలవాఁడు, గంపశ్రాద్ధపుఁ దలకట్టువాఁడు
ఎపుడు కాఫీదుకాణపు లేవిణీవాఁడు, సిగరు పీలుపు బుగబుగలవాఁడు
పైపటారమును లోపల పొటారమువాఁడు, పట్టుదప్పిన చలో భాయిగాఁడు
తుదమొదల్లేని గాడిదగత్తరలవాఁడు, జలసాలతోఁ బడిచచ్చువాఁడు
తడియనెడి దున్నచోఁ జేతఁ దుడుముమొదలు, దేవతార్చనవఱ కొక్క తీరువాఁడు
వలనుపడకున్న శ్రీశుకువంటివాఁడు, త్రోవ దొరికిన వట్టి గంధోళిగాఁడు!"

## గంగుల శాయిరెడ్డి విచారం

గోలుకొండకవుల్లో ప్రఖ్యాతుడైన గంగుల శాయిరెడ్డి (1895-1975) 'కర్షకా' అనే శీర్షిక కింద రైతులనుద్బోధిస్తూనే నైజాం పరిపాలనలో హైందవులయిన తెలుగువారు కూడా తమ వారి సమస్యలను పట్టించుకోవటం లేదని దుఃఖిస్తాడు :

"నీజాతివారలు రాజులై యుండియుఁ, గనఁజాలరైరి నీ కష్టమెల్ల
నీకొలమందు జన్మించిన యా జమీం,దారులు గనరు నీ తాపమెల్ల

*నీశాఖలో ధననిలయులౌ కొందరు, పరికింపలేరు నీబాధలెల్ల*
*నీ తెగలో విద్యనేర్చిన బియ్యేలు, లిఖియించరైరి నీ లేములెల్ల*
*న్యాయవాదులు నీవార లడుగరైరి, న్యాయమూర్తులు నీవార లరయరైరి*
*ఇంకఁ బెరవారి ముచ్చట లెందుకయ్య, కర్షకా! నీదు కష్టముల్ గాంతు రెవరు?"*

*"జాగీరు పౌరులు స్థానంబు లేకను, పరుల పంచలఁ జేరి బ్రతుకవలసె*
*నగ్రహారపుఁ బ్రజ హక్కులన్నియు వీడి, యొరులొద్దఁజేరియు నొదుగవలసె*
*బంజర రైతులు బాటలు గానక, దశదిశలం జూచి తారవలసె*
*కౌలుదా రెప్పుడు కడగండ్లఁ బడుచును, స్థిరము గుర్తెఱుఁగక తిరుగవలసె*
*గొఱ్ఱెమేఁకల నావులఁ గుదువఁబెట్టి, పల్లెలో నున్న పైరుల నిల్లు విడిచి*
*ఆలుపిల్లలు దుఃఖింప నడలవలసె, కర్షకా! లెమ్ము వేగమే కనులు విచ్చి."*

మతేతరుల ముష్కరపాలనలో భూస్వాముల పెత్తనందారీలో ప్రజలు పడుతున్న ఈ కష్టాల కథ 1934-1950 మధ్యకాలానికి చెందినది. రచనాకాలం స్పష్టంగా తెలియదుగాని విషయవర్ణన స్వభావోక్తిగా సాగింది.

## అబ్బూరి వివరించిన ఆనాటి స్థితిగతులు

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అంతేవాసిగా, సర్ కట్టమంచి రామలింగారెడ్డికి సన్నిహితుడుగా ఉండి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు తెలుగుశాఖలో కొద్దికాలమూ, మూడున్నర దశాబ్దాలపైకాలం గ్రంథాలయాధికారిగానూ ఉన్న అబ్బూరి రామకృష్ణరావు (1896-1979) తొలితరం భావకవుల్లో ఒకడు. తరవాత శ్రీశ్రీ వంటి ఆధునిక కవులకు గురువు. రాజకీయ, నాటక, కవితాద్యనేక రంగాల్లో తనదైన ముద్రవేసిన విద్వత్కవి, నటుడు, ప్రయోక్త, చమత్కారి. ఆయా సందర్భాల్లో ఆయన చాటువులుగా చెప్పిన పద్యాలు సమకాలిక పరిస్థితులను ప్రస్తావిస్తాయి; కొన్నిసార్లు విశదపరుస్తాయి. తానెన్నడూ చూడని ముళ్ళపూడి వేంకటరమణ నుద్దేశిస్తూ చెప్పిన కొన్ని చాటువుల్లో కొన్ని రాజకీయ విశేషాలను సూచనప్రాయంగా చెప్పాడు. 1938లో గాంధీ జిన్నాల మధ్య సైద్ధాంతికంగా పెద్దవివాదం ఆరంభమయింది. అప్పట్లో అవి అంత ముఖ్యం కాదనుకున్నారు - చాలామంది. అయితే అబ్బూరి మాత్రం అంటాడు గదా -

*"జిన్నుకు బ్రాందీకిని వలె, జిన్నాకును గాంధిజీకి చిన్నవిభేదా*
*లున్నవని యను టబద్ధము, విన్నావా? ముళ్ళపూడి వేంకటరమణా!"*

స్వాతంత్ర్యసమరసందర్భంలో మతప్రస్తావన లేకుండటమే మంచిదని జిన్నా వాదించాడు. నిజానికి 1906 నుంచీ ముస్లింలీగు ప్రత్యేక రాజకీయపక్షంగా ఉన్నా, ఎవరెంత బతిమాలినా అప్పటిదాకా జిన్నా ఆ పక్షంలో చేరలేదు. గాంధీ మతప్రసక్తి లేకుండా జనాకర్షణ

సాధ్యం కాదన్నాడు. జవహర్‌లాల్ నెహ్రూ తన రచన 'Discovery of India' లో గాంధీకున్న రుఃబలహీనతను ప్రస్తావించాడు. అప్పటి గాంధీ జిన్నాల వైరుధ్యం చిన్నవిభేదం కాదన్న అబ్బూరి మాటే నిజమయింది. 1940లో విసిగిపోయిన జిన్నా ముస్లింలీగులో చేరాడు. (సుబాస్ చంద్ర బోస్ అప్పటి కలకత్తా కాంగ్రెసులో పోరాడి ఓడి తాను అధిపతిగా ఉన్న కాంగ్రెసు సేవాదళంనుంచి తప్పుకొని, స్వాతంత్ర్య సాధనకు బ్రిటిషువారి శత్రువుల సాయం తీసుకోవాలని నిశ్చయించుకొని విదేశాలకు రహస్యంగా వెళ్ళిపోయాడు. భోగరాజు పట్టాభి సీతారామయ్యను కాంగ్రెసు అధ్యక్షపదవికి తన అభ్యర్థిగా నిలిపిన గాంధీజీ 'పట్టాభి ఓటమి నా ఓటమే'నని ప్రకటించి కృతకృత్యుడైనాడు). గాంధీ జిన్నా లిద్దరూ గుజరాతీలే. వారు విడిపోవటానికి కారణం కూడా గుజరాతీకవి నర్సీ మెహతా రాసిన "రఘుపతి రాఘవ రాజారాం..." అనే గీతంమీద గాంధీజీకున్న అఖండ విశ్వాసమూ ఆరాధనభావమే. ఆ విషయాన్ని వ్యంగ్యంగా చెప్తూ అబ్బూరి, వారి వైరుధ్యంలోనూ ఏకత్వ ముందంటాడు :

> *"జిన్నాకును గాంధీజీ, కెన్నో పోలికలు కల వదెట్లనగా లో*
> *నున్నది అల్లా ఒకడే, విన్నావా? ముళ్ళపూడి వేంకటరమణా!"*

గాంధీజీ జపించే ప్రార్థనాగీతంలో "ఈశ్వర్ అల్లా తేరే నామ్" అని ఉంది కాబట్టి గాంధీ జిన్నా లిద్దరూ అల్లా భక్తులేనని కవి భావం. కాకపోతే జిన్నా 'అల్లా'నే వరించాడు - స్పష్టంగా - ముస్లిం కాబట్టి. మతసామరస్యం పేరిట గాంధీ ఈశ్వరుడూ అల్లా అనేవి రెండూ దేవుడిపేర్లే - కాదు రఘుపతి రాఘవుడి పేర్లే - అన్నాడు! అదే వారి ఏకతాభావం.

'రాష్ట్రపతి' భోగరాజు పట్టాభి సీతారామయ్య కాంగ్రెసు చరిత్ర రాసినవాడు. గాంధీ సిద్ధాంతాలకు భాష్యకారుడు. ఆయనోసారి కాంగ్రెసువాదులు ఆత్మరక్షణార్థం లాఠీ లుపయోగించినా, అది అహింసామార్గావలంబనమే నని వ్యాఖ్యానించాడు! దానికి ప్రతిగా అబ్బూరివారి వెక్కిరింత ఏమంటే -

> "తన్నులు దిని ప్రహ్లాదుడు, తన్నించె నృసింహుచేత తండ్రిని చంపెన్
> దీన్నే 'అహింస' అందురు..."

అనేది. తాను స్వయంగా హింసించకపోతే అది అహింసేనని ఆక్షేపణ. భోజనప్రియుడూ శృంగారపురుషుడూ తనకు గురుప్రాయుడూ అయిన ఆంధ్రరత్నమీద అబ్బూరి పద్య మిది :

> ఉపమాపై పెసరట్టుపై ఇడిలిపై హుమ్మంచు చూపించు నీ
> జపసంబద్ధ పరాక్రమక్రమ కటాక్షశ్రేణి మన్నించి శు
> భ్రపు జిల్లేబి పకోడి లడ్వగయిరాపై కొంత రానిమ్ము శ్రీ
> *చపలాపాంగ సితాంగనాహృదయపాశా! పూజ్యవస్తుప్రియా!"*

పైపద్యంలోని భోజనపరాక్రమ విషయంకన్నా ముఖ్యమయినది సంబోధనలలోని సారస్యం. పూర్వం జగన్నాథ పండితరాయలు "*న యాచే గజాళిం న వా వాజిరాజిం,* న

*విత్తేషు చిత్తం మదీయం కదాచిత్, ఇయం సుందరీ మస్తకన్యస్తకుంభా, లవంగీ కురంగీదృ గంగీకరోతు''* అని ఏనుగులూ గుఱ్ఱాలూ డబ్బూ వద్దుగాని నేనంగీకరించే బహుమతి ఈ లవంగి అనే కురంగనయనే అన్నాడని ప్రవాదం. ఆ ధోరణిలోనే శాసనసభా బహిష్కార సందర్భంలో జైలునుంచి విడుదలై మదరాసు చేరిన ఆంధ్రరత్న ఉపన్యసిస్తూ పైశ్లోకాన్ని పోలిన శ్లోకమొకటి చెప్పాడు : "న యాచే రిఫారం న వా స్టీలుఫ్రేముం, న కౌన్సిల్ నతు ప్రీవికౌన్సిల్ పదం వా, స్వరాజ్యార్థి హస్తాంగ్లరాజ్యే నియన్తా, ఫరంగీ ఫిరంగీదృ *గంగీకరోతు''* అని. తనకు సంస్కరణ (రిఫారం) అక్కరలేదని, ఉక్కు పంజరంలాంటి కారాగారమూ (స్టీల్‌ఫ్రేము) వద్దని, వైస్రాయి కౌన్సిల్లోగాని ప్రీవీకౌన్సిల్లోగాని పదవులక్కరలేదనీ, కాకపోతే స్వరాజ్యంకోసం పడుతున్న తపనకు విరుగుడుగా ఫిరంగుల్లాంటి చూపులు విసిరే ఫరంగీ (తెల్ల దొరసాని)నయితే స్వీకరిస్తాననీ సంస్కృతంలో చెప్పాడు. (ఆంధ్రరత్న దేశభక్తికీ రామభక్తికీ సంస్కృతభాషాజ్ఞానానికీ నిదర్శన శ్రీరంగం వెళ్ళినప్పుడు 'శ్రీరంగనాథప్రబోధ' మనే నవరత్నమాలికగా ఆశువుగా చెప్పిన తొమ్మిది సంస్కృతశ్లోకాలు. వాటిలో దేశచరిత్రనూ దుర్దశనూ వివరించి దేవుడే మమ్మల్ని కాపాడాలంటాడు. సంస్కృతంలోని 'అభినయ దర్పణాన్ని' ఆనందకుమారస్వామితో కలిసి తాను ఎడింబరోలో చదువుతున్నప్పుడే ఇంగ్లీషులోకి అనువదించాడు). అబ్బూరి పద్యంలో ఆంధ్రరత్నకున్న పాశ్చాత్య స్త్రీ వ్యామోహాన్నీ పూజ్యవస్తుప్రియత్వాన్నీ (స్కాట్లండులో ఉండగా ఆయన స్కాచ్ తప్ప మరేదీ ముట్టలేదనే ప్రవాదమూ ఉంది కాబట్టి, మంచి వస్తువులమీది ప్రియత్వాన్నీ) సూచించాడు.

అబ్బూరికి నచ్చని తెలుగు రాజకీయవాది కళా వెంకట్రావు. ఆయన చాణక్యుడి వంటివాడనీ, శకునివంటివాడనీ బాగుపరచటంకన్నా చెడగొట్టడంలో అఖండమేధావి అనీ పేరు సంపాదించాడు. ఆ కళావారిని గురించి అబ్బూరి చెప్పిన పద్య మిది :

> *"వంక ల్లేని తెలుంగు వైభవ కళాభాగ్యం బభాగ్యంబుగా*
> *శంక ల్లేపుటయందు పేర్వడిన ప్రజ్ఞాశాలి శ్రీశ్రీ కళా*
> *వెంకట్రా వొక దేగుదెంచె, నితడే వెంకన్న, ఇవ్వానికిన్*
> *టెంకాయల్ పగులంగగొట్టు, డిక జాడింపుండు మీ జందెముల్."*

పూర్వం ఒక విద్వాంసుణ్ని జయించే మార్గం తోచక తెనాలి రామలింగడు అతడిచుట్టూ ముమ్మారు ప్రదక్షిణంచేసి ఆ పండితుడి కాలివెంట్రుక పీకి తన తలమీద పెట్టుకొని ఇందువల్ల తనకు పుణ్యలోకాలు తప్ప వన్నాడంటారు. ఆ మాటలు నమ్మిన సభాస్తారు లందరూ అలాగే చేయటంతో రక్తపాతం భరించలేక ఆ పండితుడు పారిపోయాడనేది పిట్టకథ. అదే విధంగా కళా వెంకట్రావ్ వేంకటేశ్వరస్వామి అని భావించి అతడి పాదాలమీదనో నెత్తి మీదనో టెంకాయలు పగలగొట్టండని పట్టాభి తెన్నేటివంటి ఇతర బ్రాహ్మణనాయకులను ఉద్బోధిస్తున్నాడన్నమాట (జందేలు జాడించమనటంలో).

అబ్బూరి జీవితచరమసంధ్యలో కూడా తాను ఆస్తికుడననే నమ్మకం లోకానికి

కల్పించలేక పోయాడు - కమ్యూనిస్టుగా రాయిస్టుగా చాలాకాలమున్నందువల్ల. ఆ ప్రస్తావన వచ్చినప్పు డాయన చెప్పిన పద్య మిది :

*"ఉన్నాడో లేడో నని, అన్నా డొక భక్తవర్యు డది నిజమైతే*
*అన్నా! మన గతియేమో?, విన్నావా? ముళ్ళపూడి వేంకటరమణా!"*

గజేంద్రమోక్షఘట్టంలో "కలఁడు కలం డనెడు వాఁడు కలఁడో లేఁడో" అన్న భక్తవర్యుడు బమ్మెరపోతన. అంతకన్నా చాలాముందుకాలంలోనే ఆదిశంకరాచార్యులవారు "అస్తి చే న్నాస్తి మే హాని, రస్తిచే న్నాస్తికో హతః" అన్నాడంటారు. అంటే 'ఒకవేళ (దేవుడు) ఉంటే ఉన్నాడనే నాకు ప్రమాదం లేదుగాని, లేడన్న నాస్తికుడికి హాని తప్పదు' అని అర్థం. వేదాంతుల చర్చలూ సిద్ధాంతాలూ ఎలా ఉన్నా సామాన్య మానవులకు మాత్రం చావుపుట్టుకల, జన్మాంతరాల విషయం తెలిసేదీకాదు, తేలేదీకాదు. అందుకే అబ్బూరి "చచ్చిపోయి జీవి ఎచ్చటకేగునో, ఏమియగునొ ఎవరి కెరుకలేదు, ఎరుకలేనివార లేమేమొ చెప్పగా, విని తపించువారు వేనవేలు" అని సామాన్యప్రజల బాధను వివరించాడు మరో పద్యంలో. అయితే కమ్యూనిస్టులకు మాత్రం ఖరాఖండిగా దేవుడి విషయం తెలుసంటా డాయన :

*"ఉన్నాడో లేడో శ్రీ, మన్నారాయణుడు, కాని మనవారికి స్టా*
*లిన్నే భగవంతుండట!"* అని తేల్చివేశాడు.

అబ్బూరివారికి నాట్యరంగంమీద చాలా అభినివేశముంది. నాటకరంగస్థలంలో తెరతీసే ముందే 'పరాబ్రహ్మపరమేశ్వర...' అని పాడే అలవాటుంది పాత్రధారులందరూ కలిసి. అలాగే సంగీతప్రియుల విషయానికి వస్తే -

"పన్నగశయనుని కొలుచు ప్రపన్నులు నే డన్నియెడల భక్తాగ్రణులై
'పన్నాగ'శయను కొలుతురు..."

సంగీతదృష్టితో అర్థాన్ని పట్టించుకోని భక్తికిది ఆక్షేపణ. (గోపాలకృష్ణుడు పక్షి... అని మూడోకాలంలో కూడా పాడి, అలసిపోతున్న సమయంలో చివరకు "వాహనా మెక్కే"ననటం పరిపాటి. 'పక్షివాహనుణ్ని' పక్షిగానే చాలాసేపు పూజిస్తారు!)

తెలుగులో పద్యనాటకాలు వచ్చిన తరవాత అభినయంకన్నా సంగీతానికే ప్రాముఖ్యం పెరిగింది. 1880-81 నాటికే గుంటూరులో పాతూరి శ్రీరాములు స్థాపించిన హిందూ నాటక సమాజానికి 'గుంటూరు ఫస్టు కంపెనీ' అనే వ్యవహారనామం స్థిరపడ్డది. నూనె కాగడాల వెలుగులో నటీనటుల అభినయం అంత స్పష్టంగా కనిపించేది కాదు. పాటలూ పద్యాలూ అంత ఎక్కువగానూ ఉండేవి కావు. 1900-20 మధ్యకాలంలో కిరోసిన్ 'లష్టర్లు' వచ్చాయి. 'గ్యాస్‌లైట్లు' కూడా క్రమంగా స్థానం సంపాదించాయి. పద్యాలసంఖ్య క్రమంగా పెరుగుతూ వచ్చింది. పద్యనాటకాల తరం 1920-40 మధ్య తారస్థాయికి చేరింది. ఒకే పాత్రధారి పదుల వందల సంఖ్యలో పద్యాలు చదవలేకపోవటంతో రెండో కృష్ణుడు, మూడో కృష్ణుడు

వంటి కొత్త అవతారాలు వెలిశాయి! 1940 నాటికే విద్యుద్దీపాలు నాటకరంగస్థలాల్లో చోటు సంపాదించాయి. 'సినిమాట్రిక్కుల' ప్రదర్శనలు, ఫోకసింగ్ వంటి సౌకర్యాలు వచ్చాయి. డబ్బున్న నాటకాల కంపెనీలవాళ్ళు సొంతడైనమోలు కూడా ఏర్పాటు చేసుకున్నారు. గ్రామఫోన్ రికార్డులు కూడా అప్పటికి అందుబాటులోకి వచ్చాయి. 1904-5 నాటికే హార్మోనియం (హార్మనీ) వాడుకలోకి వచ్చింది ఒక ప్రధాన వాద్యంగా. శబ్దవిస్తరణయంత్రాలు (మైకులు) వచ్చాయి. వెలుతురులో నటుల ఆహార్యం, మైకుల పుణ్యమా అని సంగీతం ప్రధానాకర్షణలై ఈ రెంటి విషయంలోనూ పోటీలు పెరిగాయి. శ్రావ్యంగా పద్యం పాడిన నటుణ్ని 'ఒన్స్‌మోర్' అని ప్రోత్సహించి ఒకటికి పదిసార్లు అదే పద్యం పాడించి అభిమానులు వేదికమీదికి వచ్చి బహూకరించటం అలవాటయింది. రసస్ఫూర్తి సంగతి తుంగలో తొక్కినట్లయింది. అటువంటి కాలంలో ఒకేఒక మహానటుడి నడకను అభిమానించి మళ్ళీమళ్ళీ అలా నడవమని ప్రేక్షకులు వేధించటం, అతగాడు విసిగి చివరకు ఒకటికి పదిసార్లు పరుగులు తీసినట్లు రంగస్థలంలో నడవటం, అందుకు మెచ్చి అతణ్ని అభిమానులు సత్కరించటం జరిగిందని అబ్బూరి సాక్ష్యమిస్తాడు.

*'యడవల్లి సూరనారయ, చెడదొబ్బెను నలుని పార్టు, ఛీ! ఏ లంజా*
*కొడు కిచ్చె వానికిన్ బలి, చెడుగుడు నాట్యంబు కొరకు చీనాంబరముల్!''*

అంటాడు.

యడవల్లి సూర్యనారాయణ నలుడుగానే గాక, మరే రాజువేషం కట్టినా కేవలం అతడి నడకను ఒకటికి పదిసార్లు చూచి పట్టుగుడ్డ లిచ్చి సత్కరించేవారట. ఇలా మరే నటుడికీ జరిగినట్లు తెలీదు. నటుడికి అది అఖండమైన అద్వితీయ గౌరవమే కావచ్చుగాని, నాటకం రక్తిగట్టించలేదని అబ్బూరి విచారం.

మైలవరం జమీందారు 1913లో మైలవరంలోనే బాలభారతీ సమాజ మనే నాటకసంస్థను స్థాపించి, 1916-17లో బెజవాడలో (ఇప్పటి విజయవాడలో) 'మైలవరం థియేటర్' అనే పేరిట నాటకకంపెనీ నిర్వహించటం ఆరంభించాడు. అందాకా వాద్యబృందం (ఆర్కెస్ట్రా) రంగస్థలంమీద పక్కతెరలచాటున (side curtains లో) ఉంటుండేది. మైలవరం కంపెనీవాళ్ళు రంగస్థలం ముందు గుంట (pit) తవ్వించి అందులో తొక్కుడు హార్మనీతో సహా ఇతర వాద్యాలనుంచటం మొదలుపెట్టారు. అడుగున్నర ఎత్తులో రంగస్థలం (stage) ఉండేది. ఏడున్నర అడుగుల ఎత్తున్న పందిరి మీద శబ్దవిస్తరణకోసం నాలుగు కుండలు బోర్లించి అవి కనపడకుండా జాగ్రత్త పడేవాళ్లు. పక్కతెరలు మూడడుగుల వెడల్పుండి ఏడున్నర అడుగుల ఎత్తుండేవి. రంగవేదిక మీద నటించేవారికెలా ఉన్నా ప్రేక్షకులకు మాత్రం నాట్యస్థలం ఒక బావిలా పెద్దగుంటలా కనిపించేది. అటువంటి రంగస్థలం మీద నలదమయంతి నాటకం చూసినప్పటి తన అనుభవాన్ని కవి ఇలా వర్ణించాడు :

"దమయంతీసతి కృత్రిమస్తనము లందం బేది అల్లాడ, అ
ల్లమ మస్తానుకు తీసిపోని సకలాలంకారుడౌ నైషధో

త్తము కుస్తీలను చూస్తి, బాహుకుని బేతాళప్రతిజ్ఞా మతి
భ్రమణమ్ముల్ కనుగొంటి, మైలవర కూపప్రాయ నాట్యస్థలిన్!"

అప్పట్లో పురుషులే స్త్రీవేషం ధరించేవాళ్ళు. అప్పుడు స్తనాలుగా 'గెనం' పెట్టుకొనేవాళ్ళు (కన్యాశుల్కంలో గుంటూరు శాస్త్రుర్ల శిష్యుడు ఆడవేషం కట్టమంటే ఇంటికి వెళ్ళి గెనం తెచ్చుకోవాలి గదా అంటాడు). నలుడి వేషం కట్టిన వ్యక్తి బాహుకుడి వేషం కట్టడం ప్రమాదకరమనే అంధవిశ్వాసముండేది. అందువల్ల ఆ కాలంలో ప్రసిద్ధుడైన అల్లం మస్తాన్ అనే వస్తాదులాంటి వ్యక్తిచేత బాహుకుడి వేషం వేయించేవారుట (అల్లం మస్తాన్ బులుసు సాంబమూర్తికి గురువో సహాధ్యాయోనంటారు కుస్తీల్లో, కర్రసాములో). అతడు రంగస్థలం మీద (నటనాశక్తి లేనివాడు కాబట్టి) పాలికేకలు పెడ్తూ, కట్టెలను ఉత్తచేతుల్తోనే చీలుస్తూ (నలుడి వంటలో అదో భాగ మని విశ్వాసం) పిచ్చివాడిలా ప్రవర్తించటం కూడా చూశానంటాడు కవి. బాహుకుడే నలుడని దమయంతి గుర్తించిన తరవాత, ఆ వేషం కట్టిన పహిల్వాను గట్టిగా దమయంతి వేషధారిని కౌగిలించుకోగానే గెనం ఊగులాడిపోయిందట. ఈ దృశ్యం ఆ బావిలాంటి రంగస్థలం పైఅంచున కనిపించిందని అప్పటి నాటకరంగం సంగతిని అబ్బూరి వివరించాడు.

తెలుగు కవులు స్థాపించుకున్న సంఘాల్లో సాహితీ సమితి ఒకటి. దానికి అధ్యక్షుడు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి (స్వామీ శివశంకరస్వామి). ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మేర్పాటు చేసిన సంస్థ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. దానికి అధ్యక్షుడు బెజవాడ గోపాలరెడ్డి. ఆ రెంటితోనూ తొలిదశల్లో సంబంధమున్నవాడు అబ్బూరి. ఆ రెండు సంఘాల అధిపతుల్లో స్పష్టంగా ఎవరి నుద్దేశించి చెప్పిందో గాని ఒక పద్యముంది - అది -

"చాల సామ్యమ్ము కలదట సాహితీస, భాధిపతికిని మన రాసభాధిపతికి
అర్థమెరుగని శబ్దమ్ము లతడు కూయు, తావి ఎరుగని గంధ మీతండు మోయు!"

రాసభమంటే కంచరగాడిదె. అది గుర్రానికి తక్కువ; గాడిద కెక్కువ. సమకాలంలోని ప్రసిద్ధకవులను గురించి అబ్బూరి కొన్ని పద్యాలు చెప్పాడు.

రాయప్రోలు సుబ్బారావు మీద :

"రాయప్రోలు కవిత రమణీయ మగు కూత, పిదప కవుల పాలి నుదుటి వ్రాత
తెలుగుతోట మీద దిద్దిన పైపూత, నుడులచేత పలుకుబడులచేత."

విశ్వనాథ సత్యనారాయణ మీద :

"విశ్వనాథవాణి విశ్వకుతూహలి, ఇంపుగా పురోగమింపలేక
పూర్వవాసనలకు సర్వస్వ మర్పించి, తెలుగునాడునందె నిలిచిపోయె."

**దేవులపల్లి కృష్ణశాస్త్రి మీద :**

"కృష్ణశాస్త్రి కృతులు కీర్తనలా? కావు, పదము లనుట కసలె పనికిరావు
నేటి చెవుల కింపు నింపెడి రుతులతో, కూర్చినట్టి మధురకూజితములు."

**పింగళి-కాటూరి జంటకవుల మీద :**

"కైతలోన మిన్న కాటూరి వెంకన్న, లక్ష్మికాంతు డతడు సూక్ష్మబుద్ధి
ఒకరి కున్న కీర్తి ఒకరికి రాబోదు, జంటకవు లనెడి ప్రశస్తి తప్పు."

**కాటూరి వేంకటేశ్వరరావు గురించి :**

"కాటూరి కవిమనోహర (/వేంకటేశ్వర), పాటచ్చరు డెచట నున్నవాడొ తెలియునా?
నేటి కవి కృష్ణశాస్త్రి క,వాటమునందున్న ద్వారపాలకు డతడే!"

రాయప్రోలు కవిత పైపూత వంటిదేగాని గుండెలోతులనుంచి వచ్చిన ఆవేదనాభరిత రచన కాదని అబ్బూరి నమ్మిక. నైజాం నవాబును ఒకవైపు కీర్తిస్తూ వాచకాలు రాసి ఉద్యోగాలు సంపాదించిన వ్యక్తి, ఆంధ్రుల పురావైభవంగురించి రాసినా రాష్ట్రోద్యమంలో పాల్గొనలేదు. ఆంధ్రప్రాంతంతో ఆయనకున్న సంబంధాలు చాలా తక్కువ. విశ్వనాథ, శ్రీశ్రీ అన్నట్లు నన్నయకన్నా వెయ్యేళ్లు వెనక్కుచూసే తత్వంతో ఆధునికత్వంలేని రచనలు చేశాడు. అందువల్ల తన ప్రతిభకు సరిపడా ఇతర ప్రాంతాలకు ఆయన కళాశక్తులు వ్యాపించలేదు - జ్ఞానపీఠ పురస్కారం సంపాదించినా. దేవులపల్లి కవితలో మాధుర్యముంది. శాస్త్రదృష్టితో అది సంగీతభేద మనరాదుగాని ఆధునికుల అభిరుచిని ఆకట్టుకుంది - సినిమా కవితవల్ల కూడా. పింగళి పండితుడనీ, కాటూరిదే కవిత్వమనీ ఒక ప్రవాదం ఉంది తెలుగు సాహితీ ప్రపంచంలో. దాన్నే అబ్బూరి వ్యక్తీకరించాడు. 'కవితలో మిన్న' అయిన కాటూరి దేవులపల్లి వీరాభిమానియై అతడితోనే ఎక్కువకాలం గడుపుతుండేవాడు. ద్వారపాలకుడిలా వ్యవహరించాడన్నా కాటూరి కోప్పడలేదుగాని, దేవులపల్లి అలిగి రెండేళ్ళు అబ్బూరితో మాట్లాడలేదు - కారణం 'నేటి కవి' అన్న పదబంధం! అక్కిరాజు ఉమాకాంతం నేటికాలపు కవిత్వం అనే విమర్శగ్రంథంలో కృష్ణశాస్త్రిమీద విరుచకపడటం. 'నేటి'కి బదులు 'మేటి' అని సవరిస్తానన్నా సరిపెట్టుకోలేదు!

ఇవన్నీ ఒక ఎత్తు. మల్లంపల్లి సోమశేఖరశర్మను ఆంధ్రవిశ్వ కళాపరిషత్తులో నియమించటాన్ని ప్రస్తావించిన పద్య మొక ఎత్తు. అది ఇది -

"వేతనములె తప్ప వే రేమెరుంగని, పీఠపతులతోడ వేగలేక
ఈయవలసి యిచ్చి రింకేమియునుగాదు, డిగ్రిలేని శర్మ కగ్రపీఠి."

ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగు శాఖలో వేటూరి ప్రభాకరశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మలను తొలిదశలోనే పురాతన లిపిశాస్త్రం బోధించటానికి పండితులనుగా నియమించారు

- కట్టమంచి రామలింగారెడ్డి మొదటి ఉపాధ్యక్షుడుగా ఉండగానే. ఆ యిద్దరికీ అప్పగించిన మరో విధి రంగనాథ రామాయణ తాళపత్ర ప్రతులను పరిష్కరించి ప్రచురణకు సిద్ధం చేయటం. వేటూరి వారు ఆ రచన చక్రపాణి రంగనాథుడిదే కావచ్చుగాని గోన బుద్దారెడ్డి దని ఖండితంగా చెప్పలేమని అభిప్రాయపడ్డారు. మల్లంపల్లివారూ అంతే. ఆ యిద్దరూ అదే కారణం వల్ల కొద్దికాలంలోనే ఉద్యోగాలు వదులుకోవలసివచ్చింది. పురాతత్వశాస్త్రాన్ని, పురాతనాంధ్ర లిపిని, పాతకాలపు నాణేలను బోధించగల పండితులు దొరక్క దాదాపు మూడు దశాబ్దాల కాలం ఆ చిరుద్యోగం ఖాళీగా ఉండిపోయింది. చరిత్ర శాఖలోనూ ఆ పనులు చేయగలవారు లేకపోయారు. రెండో పర్యాయం ఉపాధ్యక్షుడైన తరవాత రామలింగారెడ్డి దేశవ్యాప్తంగా గాలించినా మల్లంపల్లివారికి ప్రత్యామ్నాయ మనదగ్గ పండితులు దొరకలేదు. చివరకు వాసిరెడ్డి శ్రీకృష్ణ మూడో ఉపాధ్యక్షుడైన తరవాత ఆరేళ్లకు - 1959 నాటికి - గతిలేని పరిస్థితిలో మల్లంపల్లివారిని కేవలం అయిదు వందల రూపాయల మొత్తం భృతిమీద చరిత్రశాఖలో నియమించారు. మెట్రిక్యులేషన్ మాత్రం చదివిన మల్లంపల్లిని నియమించినందుకు ఆచార్యు లందరూ మండిపడ్డారు. వారికి పెదపెద్దజీతాలు తీసుకోవటం తప్ప మౌలికపరిజ్ఞాన సంపాదన దృష్టి కూడా లేనందువల్ల, చరిత్ర రచనకు అవసరమైన మౌలికవస్తు పరిచయ పాండిత్యాలున్న డిగ్రీల్లేని మల్లంపల్లికి విధిలేని పరిస్థితుల్లో ఉద్యోగమిచ్చారని అబ్బూరి వ్యాఖ్యానం. నాటికీ నేటికీ మార్పులే దీదుస్థితిలో. చరిత్ర, సాహిత్యం, తదితర సామాజికశాస్త్రాల్లో ఎవరో (పాశ్చాత్యులు) రాసిన గ్రంథాలనుంచి తమకు అర్థమైనంత మౌలిక సమాచారం సేకరించి భిన్నాభిప్రాయాలను ఏకరువుపెట్టడమే అధికారం, పదవులు, బిరుదులు సంపాదించగలిగిన విశ్వవిద్యాలయాచార్యుల విశిష్టత. మౌలికరచనలు పాఠశాలా పండితులవంటి చిన్న జీతాల పేదల కర్తవ్యం. భోగం ఆచార్యుల వశం.

## కవయిత్రి మాటల్లో

కనుపర్తి వరలక్ష్మమ్మ (1896-1978) గాంధేయ మార్గంలో పేరుప్రఖ్యాతులు గడించిన రచయిత్రి. 'శారదలేఖల' పేరిట తెలుగులో లేఖాసాహిత్యం మొదటిసారిగా వెలయించిన ఆమె, రాసిన కొద్దిపాటి పద్యరచనల్లో తననాడు బ్రిటిష్ ప్రభువులు విధించిన పన్నులవల్ల గలిగిన బాధలను ప్రస్తావించింది. మచ్చుకు -

> "గంజినీళ్లను త్రావ కడుపేదవారైన, తప్పక కొనియెడు నుప్పు మీద
> ధనికదరిద్రతా తారతమ్యము లేక, ఎల్లరి కగు నిప్పుపుల్ల మీద
> దినదిన మింటింట దీపాలకై..., మానకగొను మట్టినూనె మీద....
> మరల పన్నులు తగిలించె దొరతనంబు, అసలు సొమ్మును లేక అల్లాడుతటిని
> హెచ్చుపన్నులుగూడ పైవచ్చిపడిన, జనుల మనుగడ యేరీతి జరుగు నింక?"

ఉప్పు మీద, నిప్పుపుల్ల మీద (అగ్గిపుల్ల మీద), మట్టినూనె (కిరోసిన్) మీద పన్నులు హెచ్చిస్తున్నారని ఆమె సాక్ష్యం.

## భావకవుల సాంఘికదృష్టి

దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897-1980) తొలితరం భావకవి. భావకవిత్వంమీద అక్కిరాజు ఉమాకాంత పండితుడి విమర్శనలకు ఎదురొడ్డి సభలు నిర్వహించినవాడు. ఆయన 'బదరిక'లోని 'అభినవవేమనపద్యసంగ్రహం'లోని ఒకటిరెండు సమకాలిక అధిక్షేపణీయ విషయాలు గుర్తించతగ్గవి. పిఠాపురం రాజా హార్దికంగా ఆర్థికంగా సాయపడగా తెలుగులో సమగ్రనిఘంటువు తేవాలనే ప్రయత్నం జరిగింది. ప్రధాన సంపాదకత్వం వేదం వేంకట రాయశాస్త్రి వంటి మహావిద్వాంసుడికి దక్కలేదు. ఆంధ్రసారస్వతపరిషదధ్యక్షుడైన జయంతి రామయ్య 'పంతులు'గారు తమ నాయకత్వంలో 'శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు' నిర్మాణం చేపట్టారు. (అందులో తాను చూపి సంపాదకు లంగీరించిన తప్పు కోరూపాయి ఇమ్మని గిడుగు వేంకట రామమూర్తి సవాలు చేశాడు. జయంతివా రందు కంగీకరించలేదు). దశాబ్దాల తరవాత తప్పులతడికగా వెలువడింది నిఘంటువు; దాత గర్భదారిద్ర్యంలోకి వచ్చి అనాథగా కన్నుమూశాడు! ఈ పరిణామాల మధ్యకాలంలో దేవులపల్లి వెక్కిరింతగా చెప్పిన పద్య మిది (జయంతి రామయ్య ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుగా ఉద్యోగవిరమణ చేసిన విద్వాంసుడు):

"కుండలాలవారు పెండిలిపెద్దలు, పింఛనయ్యగారి పెత్తనంబు
వరుడు శకటరేఫ అరసున్న వధువయా, *(విశ్వదాభిరామ! వినుర వేమ!)*"

జయంతి వగైరాలు వీరగ్రాంథికవాదులు కాబట్టి బండిరాను (శకటరేఫను) వరుడుగా ఎన్నుకొన్నారు - అది వాడుక నుంచి తొలగిపోయినా. అలాగే ఏనాడూ (అచ్చురాకముందు) కనిపించని అరసున్నాను పెండ్లికూతుర్ని చేశారు. కుండలాలవారంటే పండితుల మనటానికి గుర్తుగా చెవులను అలంకరించుకొన్నవారు. వారికి చెవులేగాని (అంటే ఇతరులు చెప్పిన విషయాలేగాని) కళ్ళున్నట్లు లేదు (స్వయంగా చూసి తెలుసుకున్న మౌలిక విషయజ్ఞానం లేదు) అని ఆక్షేపణ.

దేవులపల్లిని అనుసరించి అనుకరించి (భావ)కవి వేషంలో తిరుగులాడినవాళ్లు అనేకు లుండేవారు. వారికి (తన) వేషమేగాని ప్రతిభాదులు లేవని ఆయనే వెక్కిరిస్తున్నాడు:

'మెరుగు నంటుజోళ్లు గిరజాలు సరదాలు, భావకవికి లేని వేవి లేవు
కవితయందు తప్ప గట్టివా డన్నింట, *(విశ్వదాభిరామ! వినుర వేమ!)*"

సామ్యవాదులమీద (సోషలిస్టులో కమ్యూనిష్టులో) దేవులపల్లికి సద్భావం లేదు - పిఠాపురం జమీందారు ఆశ్రితుడు కాబట్టి. అందుకు నిదర్శనగా చెప్పిన పద్య మిది. (సామ్యవాదులు తీవ్రవాదు లని ఆక్షేపం) :

"గండురాళ్ళు మేతు గాండ్రింతు గోండ్రింతు, మొగ్గ లేతు నగ్గిపోతు ననియె
'స్వామి! ఎవర' వంటి 'సామ్యవా దన్నాడు', *(విశ్వదాభిరామ! వినుర వేమ!)*"

రాజకీయవాదులమీద (ప్రధానంగా కాంగ్రెసువారిమీద) దేవులపల్లివారికున్న తక్కువ భావాన్నీ ఎంతో కొంత వాస్తవాన్నీ ఈ పద్యం సూచిస్తుంది :

"మేన ఖద్ద రాయె పైన టోపీ యాయె, తేకువాయె నోట తీటయాయె
చవట అంతలోనె సర్వజ్ఞుడై పోయె, (విశ్వదాభిరామ! వినుర వేమ!)"

## వేదులవారి విషాదం

వేదుల సత్యనారాయణశాస్త్రి (1900-1976) 'దీపావళి'లో తీవ్రభాషలో వ్యక్తీకరించిన, స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తితో 1937లో ప్రచురించిన దేశభక్తుల కోరికలను ఈ పద్యాలు ప్రకటిస్తాయి :

"పేదల రక్తమాంసములఁ బెంపు వహించి దయాసుధారసా
స్వాదదరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్ముకై మతో
న్మాదముఁ బెంచు దేవునికి మారుగ నిల్చిన రాతిబొమ్మలం
దూదరవోవు పాడుబ్రతు కొక్క నిమేషము సైప నాయెదన్."

"నీచపు దాస్యవృత్తి మననేరని శూన్యత మాతృదేశ సే
వాచరణమ్మునం దసువు లర్పణఁ జేసినవారి పార్థివ
శ్రీ చెలువారుచోటఁ, దదస్రుగుచులన్ వికసించి, వాసనల్
వీచుచు రాలిపోవఁగవలెన్ దదుదాత్త సమాధి మృత్తికన్."

## శేషభట్టర్ సిద్ధాంత ప్రవచనం

శేషభట్టర్ వేంకట రామానుజాచార్యులు (జననం 1900-?) వకీలు. గోలుకొండ కవుల్లో సుప్రసిద్ధులు. తన సమకాలంలోని సమాజలక్షణాలను ప్రస్తావించటానికి ఆయన తొక్కిన పుంతే విలక్షణమయింది. 'ఆంధ్రనామసంగ్రహము' అనే పేరున పద్యనిఘంటు రూపంలో సమాజదుస్థితిని వర్ణించిన ఈ రచన 1934 లోగా వెలువడింది :

దేవుడు:

"భాగ్యవంతుల కోర్కులు పండఁజేసి, భాగ్యహీనుల కష్టాల పాలొనర్చి
జగములెల్ల నిరంకుశ సరణి నేలు, వ్యక్తి పేరొప్పు భగవంతుఁ డన నుమేశ!"

బ్రాహ్మణవర్గు :

"యజ్ఞ మన భ్రూణహత్యకు నగ్నిహోత్ర, మనఁగ సిగరేట్లు కాల్చుట కాఖ్య లమరు
యాచకున కొప్పుఁ బండితుం డనఁగ వేద, పాఠి యనఁగను గవినాఁగఁ బార్వతీశ!"

ఆశ్రమవర్గు :

"గుడిసెవ్రేటు నుంచుకొనుటచేఁ బెండిలి, కానివాఁడు పెండ్లికాక ముండ
నుంచుకున్నవాఁడు మర్విపై విలసిల్లు, బ్రహ్మచారి యనఁగఁ బ్రమథనాథ!"

"దినమెల్ల బిచ్చమెత్తుట,యును నిశలందెల్లఁ జౌర్య మొనరించుటయున్
బనిగల హిందూదేశపు, మనుజుఁడు సన్న్యాసి నాఁగ మహి నొప్పు శివా!"

దరిద్రవర్గు :

"అద్దెకొంపనఁగఁ దాటాకుల గుడిసెనాఁ, జెట్టునీడ యనంగఁ జెల్లు నిల్లు
వికృతవేష కృశాంగి పిల్లలకోడి పెన్, గయ్యాళి యనుపేళ్లఁ గ్రాలు నాలు
సజ్జయన్నము జొన్నసంకటి మంచినీ,ళ్ళుపవాస మననొప్పు నోగిరంబు
కోతిమూక దరిద్రగొట్లు సోమర్లన, నామముల్ బరగు సంతానమునకు
నార్జనము పేళ్లు విలసిల్లు న ప్పనంగఁ, జౌర్యవృత్తి యనంగ భిక్షం బనంగఁ
బని యనఁగఁజెల్లుఁ బనిలేనితనము పేరు, పురదనుజభంగ! శేషాహిభూషితాంగ!"

వ్యవహారవర్గు :

" 'అప్రయోజకుఁడు' నా 'నవివేకి' యన రెండు, సంకేతములు చెల్లు సజ్జనునకు
'షండుఁ' డన 'నపుంసకుం' డన నాఖ్యలై, యెసఁగుచుండును విజితేంద్రియునకు
'ఛాందసుం' డన 'వేదజడుఁ' డన నామముల్, బరగు సదాచారవర్తనునకు
'స్నేహదూరుం' డనఁ 'జెనఁటి' నా నభిధలై, క్రాలుచుండును సత్యశీలునకును
జరఁగుఁ 'బిసినిగొ' ట్టనఁగఁ 'బిశాచి' యనఁగ, ద్రవ్యశాలి కభిఖ్యలై ధరణియందుఁ
'దత్త్వవేత్త'కు 'గంజాయిదమ్ముగాఁ' డ,నంగ నభిధేయమై యొప్పు నంగజారి!"

స్వదేశవర్గు :

"ధనధాన్యము లన శౌర్యం, బన ధైర్య మనంగ విద్య యన విజ్ఞానం
బనఁ జెల్లు భరతఖండం,బునఁ గానఁగరాని వస్తువుల పే ళ్లభవా!"

"వేసారక శుష్కో్ప,న్యాసము లిడువాఁడు 'దేశనాయకుఁ' డనఁగా
భాసిలుఁ దద్ర్శోతల కగు, వాసవముఖవినుత! 'దేశభక్తు' లనంగన్."

వైష్ణవుడైన కవి శివుణ్ని సంబోధిస్తూ సమకాలిక సమాజపరిస్థితులకు తగినట్లుగా మారని మాటలకు మారిన అర్థాలు చెప్పటంలోనే చమత్కారముంది - నిర్వచన రూపంలో. ధనవంతుల కోరికలు తీరుస్తూ పేదలను బాధిస్తూ నిరంకుశంగా పాలించేవాడే దేవుడంటాడు. 'నా విష్ణుః పృథివీపతిః' అన్నట్లు దేవుడే రాజు, రాజే దేవుడు - రాజానుమతమే ధర్మం. గర్భస్థశిశువును చంపి దాన్ని యజ్ఞమంటున్నారని, సిగరెట్లు కాల్చటాన్నే అగ్నిహోత్ర మంటున్నారని కవి నిర్వచనం. సిగరెట్ల వాడుక పవిత్రకార్యంగా నైజాం రాజ్యంలో కూడా వ్యాపించిందని సాక్ష్యమిస్తున్నాడు కవి. పండితులనూ, వేదం చదివేవాళ్ళనూ కవులనూ బిచ్చగాళ్ళని భావిస్తున్న దట సమాజం. పెళ్ళి చేసుకోకుండా ఉంపుడుకత్తెను చేరదీసినవాణ్నీ, పెళ్ళికానందు వల్ల అలాగే వ్యవహరించే వ్యక్తినీ 'బ్రహ్మచారి' అంటారట! (భోజరాజీయంలో

ఇలాంటిదే ఒక కథ ఉంది. నదికి ఒకవైపు వశిష్ఠాశ్రమం ఉండేది. ఆ మహర్షి గృహస్థుడు. రెండోవైపున దుర్వాసుడు నిరాహారదీక్షతో తపస్సు చేస్తుంటాడు. తన ఎరికలో ఉన్న వ్యక్తికి తిండిపెట్టడం గృహస్థధర్మం కాబట్టి అరుంధతి ద్వారా భోజనం పంపుతుండేవాడు వశిష్ఠుడు. ఒకమారు వరదలు వచ్చాయి. నదిదాటే దెలాగంటే వశిష్ఠుడు 'సదా బ్రహ్మచారి' చెప్పాడు, దారి ఇమ్మంటే ఇస్తుంది పొమ్మంటాడు. తిరిగివచ్చే మార్గం దుర్వాసుడే చెప్తా డంటాడు. 'సదానిరాహారి' చెప్పాడను, దారి ఇస్తుందంటాడు దుర్వాసుడు. తిరిగివచ్చి భర్త నిదేమని అడిగితే గృహస్థధర్మంగా సంసారంచేస్తూ పరస్త్రీవిముఖంగా ఉండే వ్యక్తి సదాబ్రహ్మచారి అనీ, అప్రయత్నంగా ఎవరో పంపిన ఆహారాన్ని మర్యాదకు స్వీకరించినవాడు సదానిరాహారి అనీ వివరిస్తాడు. ఆ విధంగా కాకపోయినా విధిలేక వ్యభిచరిస్తున్నవాణ్ని 'బ్రహ్మచారి' అని వెక్కిరింతగా పిలిచేవారన్నమాట! అబద్ధాలకోరును సత్యహరిశ్చంద్రు డన్నట్లు).

పగలు బిచ్చమెత్తుతూ రాత్రులు దొంగిలించటమే పనిగా పెట్టుకున్నవాడు సన్యాసి. ఇల్లంటే అద్దెకొంప కావచ్చు, తాటాకుల గుడిసె కావచ్చు, చివరికి చెట్టునీడైనా కావచ్చునట. పిచ్చివేషం వేసేది, బక్కచిక్కింది, పిల్లలకోడి, గయ్యాళి అనే పేర్లు ఇల్లాలికి వచ్చాయిట. సజ్జ కూడు తిన్నా, జొన్నసంకటి తిన్నా, మంచినీళ్ళు తాగి పస్తున్నా తిండి తిన్నట్లే నట. సంతానమంటే కోతిమూక, దరిద్రగొట్లు, సోమర్లు. అప్పుచేయటం, దొంగతనం, అడుక్కోవటం అనేవాటికి సంపాదన అనే పేరు. పని అంటే పనిలేకపోవటమనే అర్థమంటాడు కవి. పెద్దమనిషిని అప్రయోజకుడుగా అవివేకిగా పరిగణిస్తారు జనం. సంసారం చేయనివాణ్ని షండు డని (కొజ్జా అని), నపుంసకుడని భావిస్తారు. ఆచారవంతుణ్ని ఛాందసు డంటారు, వేదజడు డంటారు (వేదం చదివి లోకజ్ఞానం లేనివా డంటారు). నిజంచెప్పే వ్యక్తిని స్నేహదూరు డంటారు; చెనటి అంటారు. డబ్బున్నవాణ్ని పిసినిగొట్టు, పిశాచి అని పిలుస్తారు. వేదాంతిని గంజాయిదమ్ముగా డంటారు.

మొత్తం భారతదేశంలో దొరకని వస్తువు లేవంటే ధనం, ధాన్యం, శౌర్యం, ధైర్యం, విద్య, విజ్ఞాన మనేవి! ఊపిరాడకుండా పనికిమాలిన ఉపన్యాసాలు దంచేవాడు దేశనాయకుడు; వాటిని వినేవాళ్లు దేశభక్తులు. ఈ విధంగా సమాజంలో మారిన, మారుతున్న విలువలను శేషభట్టర్ పద్యాల్లో నిఘంటురూపంలో బంధించాడు.

## శ్రీశ్రీ చెప్పిన విశేషాలు

శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ : **1910-1983**) మొదట పద్యకవిగా 'ప్రభవ' రాసి, తరవాత గేయకవిగా సుప్రతిష్ఠితుడై, కొంతకాలం సరదాకు మళ్ళీ పద్యాలు రాశాడు. 'రుక్కుటేశ్వర శతకం' పేరిట ఆయన **1947-48**లో రాసిన పద్యాలు ఆరుద్రతో **(1925-98)** కలిసి రాసినవి. 'ఆరుద్ర' అసలు పేరు భాగవతుల సదాశివ శంకరశాస్త్రి. అతడు శ్రీశ్రీ మేనల్లుడు. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి **(1914-68)** పండితకవి, విమర్శకుడు, చమత్కారి. ఆయనంటే చాలామంది సమకాలికులకు అభిమానం. ఆయన్నే 'జరు, జరుక్, రుక్కాయ్,

మిణీశాస్త్రి' వగైరా ముద్దుపేర్లతో మిత్రులు పిలవటం కద్దు. అతగాడు ప్రాచీనుల్లో ప్రాచీనుడు, నవ్యుల్లో నవ్యుడు. అతణ్ణిగురించి చెప్పిన పద్యంలో అతడు కాఫీ టీ సేవనలో, పొగ విడవటంలో, కూనిరాగాల్లో సమర్థు డనే దొకటి. అందులోని మొదటిభాగం అప్పటికి సమాజజీవనంలో భాగమైన పానీయాలనూ (సిజర్స్ సిగరెట్) పొగతాగుడునూ పేర్కొనటం. ఆ పద్య మిది :

"ద్విగుణీకృత కర్తరికా, సిగరెట్ పొగరీకృతుండు జిహ్వాగ్రనటత్
భుగభుగభుగాయితోజ్జ్వల, రిగసా సగరీ సరీగ రిగ సారుండున్."

'జరూ' అనే మకుటంతో చెప్పిన పద్యాల్లో స్వాతంత్ర్యం వచ్చిన కొత్తల్లోనే కాంగ్రెసు మంత్రులు విపరీత ప్రవర్తనకు ఒడిగట్టారనే విమర్శ ఉంది. అవి ఇవి :

"అదిరా! అసలు రహస్యం, చదవేస్తే ఉన్న తెలివి జారిన రీతిన్
పదవీ స్వీకారంతో, మది చెదరెను భారతీయ మంత్రులకు జరూ!"

"వెళ్ళిరి దొర లనుకుంటే, కోళ్లు తినేవాళ్ళ బదులు గొర్రెల్ని తినే
వాళ్ళొచ్చినట్లు కాంగ్రెసు, కుళ్ళాయిలవాళ్లవల్ల ఘోరాలు జరూ!"

పై పద్యాలు వాడుకభాషలో ఉండటం ఒక ప్రత్యేకత అయితే, తొలి మంత్రివర్గంలోనే కాంగ్రెసువాళ్ళు జస్టిస్ పార్టీకి చెందిన సర్ షణ్ముగం చెట్టియారు (1892-1953) అనే వ్యక్తిని ఆర్థికమంత్రిగా నియమించటం కవులకు కోపకారణమని బయటపడుతుంది. ఆ మంత్రి అమెరికావారి మార్షల్ ప్రణాళికను సమర్థించాడనీ, అందువల్ల మనదేశం సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వ్యవస్థవైపు ఆకర్షితమవుతున్నదనీ సామ్యవాదులయిన కవుల విమర్శ. ఆ పద్యం -

"మార్షల్ ప్రణాళికకు మన, స ర్షణ్ముగ చెట్టియారు స్వాగత మిస్తే
హర్షిద్దా మని కొందరు, వర్షానికి చాతకాలవలె కలరు జరూ!"

పై ధోరణిలోనే శ్రీశ్రీ, 1947లో రాసిన 'ఉపాలంభం'లో గాంధీజీ అనుచరులే హింసావాదం చేశారని, కాంగ్రెసువాళ్ళు నల్లబజారు వ్యాపారం చేస్తూ ప్రజల సంగతి పట్టించుకోకుండా కొట్లాడుకుంటున్నారని, మనవాళ్ళేనని నమ్మి శాసనసభలకు ఎన్నికచేసి పంపితే మన స్వేచ్ఛను హరిస్తున్నారని పద్యాలు చెప్పాడు. ఆ చెప్పిన క్రమంలోనే వాటిని ఉదాహరిస్తే ఇలా ఉంటాయి :

"దేవుడి పేరిట ఏవేవో వెధవపనుల్ పొనర్చు టున్నది కద, హిం
సావాదం గాంధీజీ, సేవకులే చేయలేదె? సిరిసిరిమువ్వా!"

"చీకటి బజారులో (వే,ళాకోళం కాదు) లక్షలకొలందిగ మ
స్కాకొట్టిన వాళ్ళంతా, శ్రీ కాంగ్రెస్‌వాదు లౌర! సిరిసిరిమువ్వా!"

"కోట్లకొలది ప్రజలను చీ,కట్లోపల వదిలి నేటి కాంగ్రెసు రాజ్యం
కాట్లాటల పోట్లాటల, చీట్లాటగ మారిపోయె సిరిసిరిమువ్వా!"
"మన కాంగ్రెసని అసెంబ్లీ, కనుపగ నది యున్న స్వేచ్ఛ నవరోధించెన్
మనసు నపుంసక మని పం,చిన దయితన్ దవిలినట్లు సిరిసిరిమువ్వా!"

ఈ పద్యాల మకుటం సిరిసిరి మువ్వ. అదే మకుటంతో రాసిన మరి కొన్నింటిని ప్రస్తావించే ముందు పై చివరి పద్యంలో ఒక సంస్కృతశ్లోకభావాన్ని వాడినట్లు గుర్తించవచ్చు. అది "నపుంసక మితి జ్ఞాత్వా ప్రియాయై ప్రేషితం మనః, తత్తు తత్రైవ రమతే హతాః పాణినినా వయమ్" అనేది [పాణిని మాట నమ్మి మనసు నపుంసక (లింగశబ్దం)ం కదా అని ప్రేయసి దగ్గరకు పంపితే అది అక్కడే రమిస్తున్నది. ఆ నమ్మకం కొంపదీసింది]. సిరిసిరిమువ్వా మకుటంతో ముస్లింలీగు దేశవ్యాప్తంగా విస్తరించటాన్ని కవి పేర్కొన్నాడు :

"ఏం లాభం? పెరిగిన గ,డ్డంలా దట్టంపు కారడవిలా మనదే
శంలో వ్యాపించిన ము, స్లింలీగును చూడరాదె సిరిసిరిమువ్వా!"

శ్రీశ్రీ తన కభిమానపాత్రులైన దేవులపల్లి కృష్ణశాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రులను ఇదే మకుటం గల పద్యాల్లో ప్రస్తావించాడు :

దేవులపల్లి గురించి :

"అల కృష్ణశాస్త్రి వేమన, మెలకువ లాధునికఫణితి మెరపించుటచే
సులువయ్యెను నా కుభయుల, చెలిమి ఒకే పద్యమందు సిరిసిరిమువ్వా!"....
"విగ్గేల కృష్ణశాస్త్రికి?, సిగ్గేలా భావకవికి? సిరిసిరిమువ్వా!"

కృష్ణశాస్త్రి వేమనపద్యాల నింతకు ముందే ప్రస్తావించాం. ఆ శాస్త్రే భావకవుల గిరజాలను వెక్కిరించాడు - విగ్గులు పెట్టుకొని తనను అనుకరిస్తున్నందుకు. శాస్త్రికి మాత్రం విగ్గుతో పనిలేనంత జుట్టుం దంటూనే కవితాధోరణి విషయంలో భావకవులు సిగ్గుపడటం లేదని ఆక్షేపించాడు.

జలసూత్రం గురించి :

" 'చుళుకీకృత కాఫీ టీ, జలనిధి' అనిపించుకున్న జలసూత్రం శా
స్త్రుల పాలాస్త్రులు కడు విల, సిలుత తెలుగుకురుపుమీద సిరిసిరిమువ్వా!"

సమకాలికుల ఛాందస కవుల ధోరణిని వెక్కిరించిన జలసూత్రం మాటలు తెలుగు సాహిత్యానికి వచ్చిన కురుపులమీద వేసిన పళాస్త్రిపట్టీ వంటివని, దాని ప్రభావంవల్ల సదరు సాహిత్యానికి సంక్రమించిన రుగ్మత పోవాలని కవి భావన. తెలుగు పత్రికల్లో వ్యాపారధోరణి పెరుగుతున్నదని, ఫలితంలో అవి సత్యదూరంగా ప్రవర్తిస్తున్నాయని చెప్పిన పద్య మిది :

"వ్యాపారప్రకటనలే, వ్యాపించుటచేత నేటి పత్రికలందున్
రాపిడిపడి సత్యం కా,శీపయనం కట్టెనయ్య సిరిసిరిమువ్వా!"

గురజాడ సృష్టించిన పాత్ర గిరీశమూ, పానుగంటి లక్ష్మీనరసింహారావు (1865-1940) తన 'సాక్షి' వ్యాసాల్లో సృష్టించిన జంఘాలశాస్త్రి అనే విమర్శకపాత్రా తన నాటికి సజీవపాత్ర లయినాయని శ్రీశ్రీ కింది పద్యాల ద్వారా కితాబిస్తున్నాడు :

గిరీశం గురించి :

"నవయువకులకు నమూనా, కవి యైన గిరీశ మకటకట! సంఘోప
ద్రవముల సవరణల కాశిం,చి వెల్లకిలబడుట తలతు సిరిసిరిమువ్వా!"

జంఘాలశాస్త్రి గురించి :

"జంఘాలశాస్త్రిం మానవ. సంఘాల వ్రణాలపాలి శస్త్రిన్ ప్రత్యు
ల్లంఘన వాగ్రచనల మేస్త్రిం ఘనభక్తిన్ స్మరింతు సిరిసిరిమువ్వా!"

## కర్షకకవి సాక్ష్యాలు

కర్షకకవి ఏటుకూరి వేంకట నరసయ్య (1911-49) తన రచన 'క్షేత్రలక్ష్మి'లో 1943 ప్రాంతాల్లో పేర్కొన్న సామాజిక విశేషాల్లో కొన్నిటిని పరిశీలిద్దాం :

"మంట లొలుకఁబోయు మఱధాన్య మేతెంచె
ఉడుకుఁదిత్తు లయ్యె నాడళు లెల్ల...."

"సేద్య మొరుల పాలు జీవమ్ము మఱి పాలు, స్వాస్థ్య మంతొ యింతొ చదువు పాలు
కష్ట మోట్ల పాలు కలిమి డంబము పాలు, మా చరిత్ర తుదకు మచ్చ పాలు..."

"కవిత సానఁ దీరెఁ గాల మెంతో మాఱెఁ, గర్షకుండు గ్రంథకర్త యయ్యె..."

"తీరికవేళల రాటపు, ధోరణి మానకుము పనుల తొందర నయినన్..."

"వాడల్ డీకొలుపన్ సమర్థులగు సంపన్నుల్ వృథాపోయి మా
ర్వాడీబాబుల బిచ్చమెత్తెదరు..."

దంపుడుబియ్యం స్థానంలో మరబియ్యం వాడుకలోకి వచ్చిన తరవాత శ్రమశక్తి తగ్గింది, అనారోగ్యం పెరిగిందని కవి దుఃఖం. కౌలుదారీ వ్యవస్థ అమలుకురాగానే రైతులు సొంత వ్యవసాయం మానుకొని, మరబియ్యంతో ఆరోగ్యం మందగించగా, ఏపాటి ఆరోగ్యమున్నా చదువుల వ్యామోహంలో పడుతున్నారని కవి నిర్వేదం. ఎంతో కొంత కష్టపడి సంపాదించిన సొమ్ము ఎన్నికల్లో ఓట్లు కొనటానికే వ్యర్థమయిపోతున్నది. అయినా పదిరూకలు దాచుకోగలిగిన నూతనైశ్వర్యవంతులు బడాయికి డబ్బు తగలబెడ్తున్నారు. ఫలితంలో గౌరవప్రదమైన రైతు జీవితం అప్రతిష్ఠపా లయిపోతున్నదని కవి బాధపడతాడు. కొత్త సంపదలూ మోజాలూ పెరిగిన నవ్యులు గాంధీజీ అలవరిచిన రాట్నాన్ని తిప్పటం మానుతుండబట్టే, కవి మానవద్దని బతిమిలాడుతున్నాడు. మిల్లుగుడ్డల వాడుక పెరిగిందనేది వాచ్యంగా చెప్పనక్కరలేదు. సేద్యపు

ఖర్చులు పెరుగుతున్నాయి. సంపన్న కుటుంబాలవారు కూడా దుర్వ్యయంవల్ల పేదవడి మార్వాడీ బాబుల దగ్గర అప్పుచేసి హెచ్చు వడ్డీలు చెల్లిస్తున్నారు. అప్పిమ్మని అడుక్కతినవలసి వస్తున్నది. (1938లోనే రైతుల అప్పుల బాధను తగ్గించటానికి అర్ధరూపాయి కన్నా ఎక్కువ వడ్డీ రైతుల దగ్గర వసూలు చేయకూడదని టంగుటూరి ప్రకాశం రెవిన్యూ మంత్రిగా ఉన్న రాజాజీ మంత్రివర్గం ఉమ్మడి మదరాసురాష్ట్రంలో చట్టం తెచ్చింది. అది అమలుపరచమని కోర్టుల కెక్కలేని సామాన్యరైతులు మార్వాడీ వడ్డీలు చెల్లించక తప్పలేదు. అంతకుముందు రైతులు చేసిన ఋణాలను మాఫీ చేసినా, కొత్త అప్పులు చేయక తప్పలేదు - సేద్యంలో పెట్టుబడి పెట్టడానికి ప్రభుత్వసహాయం లభించనందువల్ల. ఈ దుర్భరస్థితినే నరసయ్య సకరుణంగా వ్యక్తీకరించాడు). ఈ బాధల నుంచి ప్రజలను కాపాడుతారేమోనని తెలుగు నాయకులను నమ్మడానికి వీల్లేదంటాడు కవి. ఐకమత్యం లేని తెలుగు రాజకీయనాయకులు రాజాజీ వంటి ఇతరుల పజ్జనుచేరి వారికి దాస్యం చేస్తారేగాని అందుకు సిగ్గుపడటం లేదని, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం సాధించుకోవటంలో పరస్పరావిశ్వాసాలతో వ్యవహరించినందువల్లనే రాష్ట్రం రాకపోగా అధికారం పరాధీన మయిందనీ అంటాడు కవి ఇలా :

*"తమ్ముఁ దాము నమ్మ రిమ్ములు గుర్తింప, రన్యుఁ గొలుతు రఖిల మప్పగింతు*
*రందుకతన నితరు లాంధ్రభూపతు లైరి, నానలేదు తెలుఁగునాయకులకు!"*

## పుట్టపర్తివారి బాధ

'సరస్వతీపుత్ర' బిరుదాంకితుడైన పుట్టపర్తి నారాయణాచార్యులు (1914-90) విద్వత్కవి. బహుభాషావేత్త. ఆయనకూ హోటల్ తిండి తప్పలేదు. రాజమహేంద్రవరంలో (1955లో) హోటల్ సర్వర్ చెమటలు కక్కుతూ వడ్డించే టిఫిన్ తినే దుర్యోగం తప్పిస్తే, సాధారణంగా ఆలయపూజలకు మొహం వాచిన బ్రహ్మదేవుడికి గుడికట్టించి దీపారాధన చేయిస్తానంటాడు. సంప్రదాయ పండితకవుల క్కూడా హోటల్ చిరుతిండ్లు తప్పటం లేదనటానికి ఈ పద్యం సాక్షి :

*"ఆటోపంబులు చూపు నోదుడుకు బ్రహ్మా! నీకు గోత్రాలతో*
*వాటంబౌ గుడికట్టి దీపములు నిల్పంజేతు, కక్షాటవీ*
*ఘూటోద్భూత నితాంతఘర్మజలవర్షామూర్తి దుర్జాతి యీ*
*హోటల్ సర్వరుచే టిఫిన్ తినెడు దుర్యోగంబు నీవద్దురా!"*

పూటకూళ్ళమ్మ వంటల స్థానంలో హోటల్ భోజనం వచ్చింది. దానితోబాటు అనారోగ్యకర వాతావరణమూ వచ్చిందని తెలుస్తుంది.

## జలసూత్రంవారి సూత్రాలు

జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (1914-68) పద్యరచనల్లో ప్రఖ్యాతమైనవి బుర్రా శేషగిరిరావు (1884-1919), విశ్వనాథ సత్యనారాయణల మీద చెప్పినవి. శేషగిరిరావు మంచి పండితుడు, వక్త. 1920 ప్రాంతాల్లో 'సాహితి' అనే పత్రికను నెలకొల్పాడు. బహుగ్రంథకర్త. దేశీయవిద్యను ప్రోత్సహించాలనే సంకల్పంతో 'ఆంధ్రభారతీతీర్థ' అనే సంస్థను స్థాపించి, దాన్ని 'ఆంధ్రపరిశోధనసంస్థ'గా వ్యవహరించి, సంస్థానిర్వహణకు ఆర్థికంగా సాయపడ్డ దాతలకు బిరుదులిచ్చేవాడు - ఇంగ్లీషు పొడి అక్షరాల్లో F.A.R.U. వంటివి (దీనికి అర్థం Fellow of the Andhra Research University అని!). ఆయన ఆకారలక్షణాదులను పురస్కరించుకొని జరుక్ రాసిన పద్యం :

*"బుర్రగలవాడు తలపాగబోనువాడు, నవ్యసాహిత్యపరిషద్వినాయకుండు*
*నగవుపాలైన బిరుదపిండప్రదాత, శ్మశ్రుభీకరుడైన శేషగిరిరావు."*

విశ్వనాథ కవిత్వాన్ని ఆయన శైలిలోనే అనుకరిస్తూ 'పాషాణపాకప్రభు'వనే బిరుదమిచ్చి వేళాకోళం చేసిన పద్యమొకటి, పద్యఖండ మొదటి ప్రస్తావయోగ్యాలు. అవి -

*"కించిత్తిక్త కషాయషాడబరసక్షేపాతిరేకాతివా*
*క్సంచారప్రచయావకాశములలో కవ్యర్థ! గండాశ్మముల్*
*చంచల్లీల నుదాత్తవాగ్గరిమతో సాధించి వేధించుమా*
*పంచారించి ప్రవహ్లికాకృతి కృతిన్ పాషాణపాకప్రభూ!...."*

*"గౌరవింపంగ దగ్గ శిఖండి వీవు, నీదు మార్గాన నీయంత నేత లేడు!!"*

ఆధునికాంధ్రసాహిత్యంలో విశ్వనాథ అనేక ప్రక్రియల్లో రచించాడుగాని, ఛాందస భావాలను దుర్బోధమైన కవిత్వంతో ప్రచారం చేయదలచిన విలక్షణత ఆయనదే.

## విద్వాన్ విశ్వం రాయలసీమ

విద్వాన్ విశ్వం (అసలు పేరు మీసరగండ విశ్వరూపాచారి : 1915-1985) రాయలసీమ ప్రజాజీవితంలోని భయంకర విషాదాన్ని వర్ణిస్తూ 1956లో ఏకంగా ఒక కావ్యమే రాశాడు - 'పెన్నేటిపాట'. అందులో పద్యగేయరచనలు రెండూ ఉన్నాయి. ఆ కావ్యంనుంచి ఉదాహరించే కొన్ని పద్యాలు చాలు అక్కడి వాస్తవజీవితచిత్రాన్ని ప్రదర్శించేందుకు. మచ్చుకు -

*"ఈయేటి దరుల దిన్నెల, పాయక దిరుగాడు నక్కబావలె యెపుడున్,*
*వేయారు పీన్గు లిచ్చట, నే యంత్యక్రియల బొందు నెప్పటికపుడే...*

*"...నాగుబాములు చకచక సాగునిచట... బొంతగద్ద గుంపుగట్టు నిచట...*

*"పార చేబట్టుకొని వంగి చీరుదనుక, ఇట్టె చెమ్మట కాలువగట్టుదనుక*

ఇసకపాతరలోతుల కేగుదనుక, నీకు కన్పించ దీయేటి నీటిచుక్క!...

"అదిగో! పారల నెత్తిపట్టుకొని వేయార్మంది యీకాల్వనే
పదిలంబుం బొనరింప వత్తు, రిది కుప్పల్ గొట్టు కాలంబుదా
క దినమ్ముల్ బ్రతిరైతు సేయవలె; సర్కా రూరకే పన్ను'వే
యుదు రంతే - ఒకనాడు మానిన పాలా లుత్తుత్తవై పోయెడిన్...

"కండలుగోసి, పాళ్ళిడి బికారుల జేసి జనాల నెత్తురుల్
పిండుచు, కుక్కకూడయిన బెట్టక, పొట్టలగొట్టి కూళలన్
దిండుల కానబెట్టి, జగతిన్ గరుణార్ద్రత కగ్గివెట్టు పా
షండుల వల్లకాడు మనసా! ఇది మానవ సంఘ మెట్లగున్?..."

విజయనగరసామ్రాజ్యపతనకాలంనుంచి పాళెగాండ్ర మనస్పర్ధలతో, పరస్పర మారణహోమంతో, మరాఠీ మైసూరు రాజ్యాల దండయాత్రలతో, చివరకు బ్రిటిష్ దుష్పరిపాలనతో బీడువారిన ప్రాంతంలో (వివరాలను క్లుప్తంగా హండే అనంతపురం కైఫీయతుల్లో చూడవచ్చు) మానవత్వం కూడా మంటగలిసిందని వాపోతాడు కవి. చివరకు "హృదయమా! మానవుడు నిన్ బహిష్కరించె"నని ఆక్రోశిస్తాడు. ఒక్కో మాటకు వెయ్యి నిదర్శనలు చూపవచ్చు - ఈ కావ్యం వర్ణించిన సాంఘిక దుర్గతులకు.

## దేవీప్రసాద్ దీనగాథ

పై వర్ణనల్లోని దుర్భరదుఃఖాన్ని తాత్కాలికంగా నయినా మరిచిపోవాలంటే మాచిరాజు దేవీప్రసాద్ (1922-74) బాధలను వినోదాలుగా మలిచి తెలియబరిచే సాంఘికచరిత్రను స్మరించటం మంచిది. విశ్వనాథ సత్యనారాయణ ఛాందసత్వాన్ని వెక్కిరిస్తూ ఆ విశ్వనాథ ఎదుటనే చదివి ఏడిపించిన పద్యభాగ మిది :

"... ఓ యింకొక్కటి శ్రీదిగుల్ కలదు, అచ్చొత్తించు శ్రీ ప్రెస్సులో
శ్రీయచ్చుల్ సరిపోయి యేడ్చినవిటోయ్? శ్రీవిశ్వనాథేశ్వరా!"

భావకవిత దుర్భరమైపోతున్నదని వెక్కిరిస్తూ 1946లో ఆయన రాసిన పద్యభాగం చివరి పంక్తు లివి :

"... ఓటుదో నాటుదో కున్కిపాటుదోను
ప్రణయకవిరాజుగాడి కో పడతి గలదు,
కాని నాకు ఆ మాత్రంపుదైన లేదు..."

ద్వితీయప్రపంచయుద్ధకాలంలో కాగితం వాడుకమీద ప్రభుత్వం కఠోరనిర్బంధాలు విధించింది. ఆ పరిస్థితిని వివరించే నాటికలేగాక పద్యఖండం కూడా రాసి, ఎక్సయిజ్

డిపార్టుమెంటులో తనకున్న పెద్ద పదవినుంచి తడవకొక మెట్టు దించినా నవ్వుకుంటూ అటువంటి రచనలే చేసిన మొండితనం కవిది. 'కాగితం కరువు' మీద రాసిన పద్యాలకు 'రాజకీయ బాధితు'డనే శీర్షిక పెట్టాడు! సాధారణంగా ఏదయినా విషమసమస్య వస్తే దాన్ని పరిష్కరించేందుకు ప్రభుత్వంవారు ఒక స్పెషలాఫీసరును నియమించటం ఆచారం. ఆ సమస్యను పరిష్కరించేందుకు నియుక్తుడైన అధికారి -

*"కాగితము ఖర్చు చేయనీకండి మీరు, కాగితము ఖర్చుచేయబోకండి అనుచు*
*విశ్వరూపాల వంటివి వేయి కోట్లు, వాలుపోస్టరు లంటించె వాడవాడ!"*

అప్పుడు జనమనుకున్నారుట, విషయం "వంటపట్టదా? గోడకే పట్టినపుడు" అని! ఫలిత మేమయిందంటే -

*"... అయ్యయో! లేదు చిన్నముక్కైన మంత్రి, శలవువ్రాయ ప్రధాని రిజైను చేయ!"*

అంత దుర్భరస్థితిలో కవులబాధ మరింత బాధాకర మయిందంటాడు - ముఖ్యంగా భావకవులకు. ఎలాగంటే -

*"...ప్రణయకావ్యమ్ము వ్రాయ పత్రాలు లేవు!, ప్రణయలేఖైన వ్రాయ పత్రమ్ము లేదు!!"*

సమాజం ఏమయిపోయినా ఊహాప్రేయసితో ఊహాలోకంలో విహరిస్తున్న భావకవులను జాషువా పేరుపెట్టి నిందిస్తే, దేవీప్రసాద్ పేరెత్తకుండా వెక్కిరించాడు. పనిలో పనిగా ప్రభుత్వాన్ని విమర్శించాడు. ఫలితమూ అనుభవించాడు!

అప్పటి మంత్రుల అర్థరహితచర్యలను వ్యాఖ్యానిస్తూ 'క్రాసు' అనే పద్యఖండంలో (1950లో) కొన్ని పద్యాలు రాశాడు. అందులో గడియారస్తంభం నిర్మించాలనే రాజకీయవాదుల ఉబలాటం గురించి (తానే మంత్రి అయితే చేయదలచిన పనుల్లో ఒకటని) చెప్పిన పద్యమిది:

*"సురుచిర గడియారపు వర,హారపు గురుభారము మెడనాడగ కంఠం*
*విరిగిన మృతవీరుల సం,స్మరణార్థం క్లాకుటవరు సంస్థాపింతున్."*

శిలాఫలకాలూ, స్మారకశిలలూ స్థాపించే సంస్కృతిలోని దౌర్బల్యాన్ని ఈపద్యా లెత్తి చూపుతాయి.

## దాశరథి తెలంగాణా

నైజాం పరిపాలనలో తెలంగాణా ప్రజలు ఎన్ని బాధలు పడ్డారో, ఎన్ని అవమానాలు భరించవలసివచ్చిందో దాశరథి (కృష్ణమాచార్యులు: 1925-87) ధర్మాగ్రహంతో వర్ణించాడు:

*"ముక్కలు ముక్కలై చెదరిపోయెనురా! మనజాతి, హూణభూ*
*భుక్కుల రాజనీతికి, కవుంగిళు లొడ్డిన 'రాజు' చేతిలో*

చిక్కెను కోటిమంది నివసించెడు బంగరు తెల్గునేల, నే
డక్కడ తెల్గుటంగనల ప్రాణము, మానము దక్కకుండెడున్'.

('వీరాంధ్రుడా!' నుంచి)

"నా తెలంగాణ కోటిరత్నాల వీణ, తీవియలు తెగి, విరిగి నదించకుండె;
నా తెలుగుజాణ ప్రాణమానాలు దోచి, ఈ నిజాము పిశాచి కన్నెఱ్ఱ చేసె".

('మున్నీ'తటము - నుంచి)

"...విషము గుప్పించినాడు, నొప్పించినాడు, మా నిజాంరాజు జన్మజన్మాల బూజు..."

"...కూటికి లేని పేదలకు గూడను పౌరుషమా? అటంచు స్త్రీ
కోటిని మానభంగములకున్ గురిచేసిరి ముష్కరాధముల్..."

('ముక్తభూమి' నుంచి)

"ఓ నిజాము పిశాచమా! కానరాడు, నిన్నుబోలిన రాజు మాకెన్నడేని;
తీగెలను తెంపి, అగ్నిలో దింపినావు, నా తెలంగాణ, కోటిరత్నాలవీణ".

"ప్రాణములొడ్డి ఘోరగహనాటవులన్ బడగొట్టి మంచిమా
గాణములన్ సృజించి ఎముకల్ నుసిజేసి పొలాలు దున్ని భో
షాణములన్ నవాబునకు స్వర్గము నింపిన రైతుదే, తెలం
గాణము రైతుదే; ముసలినక్కకు రాచరికంబు దక్కునే?

('రైతుదే!/తెలంగాణతల్లి' నుంచి)

"...ఇటు విముక్తాంధ్రభూమి తీపెక్కుచుండ, అటు విశాలాంధ్రసీమ చేదై జ్వలించు;
ఇటు తెలుగుజాణ ముక్తిసాహిత్యమూన, అటు తెలంగాణ
దాస్యసంకటములోన!". ('వీరాంధ్రుడా!' నుంచి)

"...స్వేచ్ఛా, భారతసైన్యమ్ము తలుపు బ్రద్దలు కొట్టెన్...
"మదమణగెన్ మా నిజాము మారీచునకున్". ('ముక్తభూమి' నుంచి)

నైజాం పరిపాలనలో దేశముఖులు, దేశపాండ్యాలు, జాగీర్దారులవంటి భూస్వామి రాజసేవకులూ, పటేల్ పట్వారీ కొత్వాల్ వంటి ప్రభుత్వ సేవకులూ, ఇథియోపియానుంచి దిగుమతి చేసుకున్న బానిస అంగరక్షకులూ, క్రమశిక్షణగాని అధికారంగాని లేని నిరంకుశులైన అరబ్బుసైనికులూ బీభత్సం సృష్టించారు. దొరలు పంటవసూళ్ళకోసం, పడతులను మానభంగం చేయటం కోసం గడీల్లో ఉన్నంతకాలం ఉండి వెట్టిచాకిరి చేయించుకొని, ఫలసాయం రాగానే ప్రభువుల కొలువుకు, వారి సుఖభోగాలకు తమవంతు సేవలందించటానికీ ఎగబడేవారు. అధికారులను ప్రసన్నం చేసుకోవటానికి 'అడ్డ/ఆడ పాప' వ్యవస్థను కొత్తగా

కల్పించారు - ఏనాటినుంచో ఉన్న జోగినీ వ్యవస్థలవంటి వాటికి తోడుగా.* దుష్పరిపాలనకు తోడుపడేందుకు ఉత్తర హిందూస్థానంనుంచి ముస్లిం మేధావులనూ, రెవిన్యూ వ్యవస్థను కట్టుదిట్టంగా నడపటానికి కాయస్థులనూ దిగుమతి చేసుకున్నారు. భారతదేశం విభక్తమయినప్పుడు బ్రిటిష్‌వాళ్ళు అప్పటికి తమకు సామంతులుగా ఉన్న సంస్థానాధిపతులు భారత్ పాకిస్థానుల్లో దేనిలో విలీనం కావాలో, స్వతంత్రంగానే ఉండాలో నిర్ణయించుకొనే హక్కు వారికే ఇచ్చారు. నైజాం పాకిస్థానులో కలవదలచినా, అందుకోసం ఎన్నో వ్యర్థప్రయత్నాలు చేసినా, భారతదేశం నడిబొడ్డులో ఉన్నందువల్ల బయటినుంచి కావలసినంత సాయం పొందలేకపోయాడు. ప్రజలు స్వతంత్రులమై 'బాన్చన్ దొరా! నీ కాల్మొక్తా'' ననే నీచస్థితినుంచి బయటపడాలని అంగలార్చారు. వీరిని అణిచివేయటంకోసం కాశీం రజ్వీ నాయకత్వంలో రజాకార్లు విజృంభించారు. ఆంధ్రమహాసభ కమ్యూనిష్టు పార్టీల నాయకత్వంతో ప్రతిఘటించిన ప్రజలు విధిలేని పరిస్థితిలో సాయుధపోరాటానికి దిగారు - 1946లో. స్వతంత్రభారతంలో హోం మంత్రిగా ఉన్న సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్ పోలీసుచర్య ద్వారా నిజాం నవాబును గద్దె దించాడు 1948 నాటికి. మొదట తాత్కాలికంగా మిలిటరీ గవర్నరు పాలన జరిగింది. తరవాత తెలుగు ప్రాంతంలో బూర్గుల రామకృష్ణరావు ముఖ్యమంత్రిగా ప్రజాస్వామ్య ప్రభుత్వ మేర్పడింది.

1953లో పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ ఫలితంగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కర్నూలు రాజధానిగా ఏర్పడింది. ఆ క్షణంనుంచి విశాలాంధ్ర స్థాపన ప్రయత్నాలు ముమ్మరమైనాయి. కొందరు తెలంగాణా నాయకులు వ్యతిరేకించినా, ఎట్టకేలకు 1956 నవంబరు 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం హైదరాబాద్ రాజధానిగా ఏర్పడింది. పాత నైజాం రాజ్యంలో ఉత్తర హిందూస్థానంనుంచి వలసవచ్చి ఉన్నత పదవులాక్రమిస్తున్నవారికి వ్యతిరేకంగా స్థానికులు 'ముల్కీ' ఉద్యమం తెచ్చారు. అదే పద్ధతిలో బ్రిటిష్‌పాలననుంచి బయటపడి స్వతంత్రులైన తెలుగువాళ్ళు తమమీద పెత్తనం చెలాయిస్తారేమోనని మరోసారి ముల్కీ ఉద్యమానికి ప్రాణంపోసి ప్రత్యేక తెలంగాణా రాష్ట్రమే ఏర్పరచాలని 1956 నుంచి అప్పుడప్పుడు తీవ్రంగా, అప్పుడప్పుడు చాపకింద నీరులాగా ఉద్యమాలు నడుస్తూనే ఉన్నాయి ఈ క్షణందాకా. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరవాత తెలంగాణా పేదరికం తగ్గినా, భూస్వాముల పెత్తనం కూడా తగ్గటంవల్ల పూర్వవైభవ పునరుద్ధరణకోసం కొందరు దొరలు పోరాడుతున్నారు. ఇంగ్లీషులో వెనకబడ్డందువల్ల తమ ప్రయోజనాలు దెబ్బతింటున్నాయని స్థానికులు ఉద్యోగాల నిమిత్తం ఉద్యమిస్తున్నారు. ఉమ్మడి రాష్ట్రం ఏర్పరుచుకుంటున్నప్పుడు చేసుకొన్న ఒప్పందాలను ఖచ్చితంగా పాటించని మాట నిజం. పంజాబు బెంగాలు రాష్ట్రాలు భాష ఒకటే అయినా మతం కారణంగా చీలిపోతే, తెలుగువాళ్ళు భాష ఒకటే అయినా మతం భిన్నం కాకపోయినా ఆర్థికసామాజిక దృక్పథాల్లోని అంతరాలవల్ల చీలిపోవా లనుకుంటున్నారు. దేశకాలపరిస్థితులు ఎటు దారితీస్తాయో చెప్పలేం.

---

* పాతకాలంలో దేవదాసీ, ఇప్పుడు బసివి (రాంఢ్రు), మాతంగి, ఎల్లారమ్మ మొదలైన వ్యవస్థలున్నాయి. భిన్నప్రాంతాల్లో, ఈ దురాచారనిర్మూలన నేటికీ సాధ్యం కాలేదు.

## గోలుకొండకవుల సాక్ష్యాలు

సురవరం ప్రతాపరెడ్డిగారి పుణ్యమా అని వెలుగు చూసిన 'గోలుకొండ కవులు' అనే సంచికలో తెలంగాణా ప్రాంతంలోని పద్యసాహిత్యం ద్వారా తెలియవచ్చే సామాజిక పరిస్థితులను గుర్తించవచ్చు. ఆ సంచికలోని రచనలన్నీ 1890-1934 మధ్యకాలంలోనివని సంపాదకులు స్పష్టీకరించారు. అయితే అందులో కనిపించే రచయితల జననకాలాదులు ఒకరిద్దరి విషయంలోతప్ప తెలియవు. ప్లేగును గురించి రాసిన పద్యం 1908 నాటి ప్లేగును గురించిందని పరోక్ష నిదర్శన ద్వారా తెలుసుకోవచ్చు. అన్ని సందర్భాల్లోనూ స్థూలదృష్టికి వివరాలు తెలియటంలేదు. అందువల్ల సామాజికస్పృహగల రచనలను పేర్కొన్నా, వాటి పూర్వాపరాలను స్పష్టంగా చెప్పలేకపోతున్నందుకు క్షంతవ్యుణ్ని. ఇకనుంచి పూర్వోక్త సంచిక నుంచి ఇంతకుముందు ప్రస్తావించని రచనలను పరిశీలిద్దాం.

కె.ఎస్. జాషువ కవి 1908లో వేలమంది ప్రాణాలు తీసిన ప్లేగును ప్రస్తావించాడు, బరువెక్కిన గుండెతో -

"కసవును గోయఁగోయ నిఁకఁ గత్తియునైనను మొక్కవోవుఁ, దా
పసులను మెక్కమెక్కఁ దుది వార్ధకమొందును వ్యాఘ్రమైన, వే
లసువులఁ దీయఁదీయఁ బద మానదు ప్లేగున కేలనో మదిన్
విసువుఁ గలుంగకున్నయది, వృద్ధతయున్ గనరాకయున్నదే!"

మాతృభాషను విస్మరిస్తున్న తెలుగు విద్యార్థిని ప్రబోధిస్తూ నిర్మల శంకరశర్మ చెప్పిన పద్యం :

"మహనీయంబగు నాంధ్రదేశమున జన్మం బందినా వీవు నీ
గృహభాషన్ ప్రథమంబుగాఁ జదువుటే కృత్యంబుగా నెంచి, స
త్స్పృహవాసంబున మాతృసేవకయి నీ సర్వస్వ మర్పించి య
స్పృహ మీ సత్కృషికై కడంగు మిఁక విద్యార్థీ! శుభాభ్యర్థివై."

మాటల కర్థాలు మారాయని పైపద్యం ద్వారా తెలుస్తుంది. అప్పట్లో ఆంధ్రదేశమని గర్వంగా చెప్పుకున్న ప్రాంతాన్ని ఇప్పుడు తెలంగాణా అనకపోతే తప్పు. అప్పట్లో 'గృహభాష' అంటే ఇంట్లో మాట్లాడే 'తెలుగుభాష' అని మాత్రమే అర్థం. ఇప్పటి మేధావులు మాండలికమే గృహభాష అని, రకరకాల రూపాల్లో భిన్నప్రాంతాల్లో పాఠ్యగ్రంథాలు రచించి బోధించాలని ఉద్బోధిస్తున్నారు!

నైజాం రాజ్యంలో పూర్వవైభవ స్మృతి తగ్గిపోయిందనీ, దాస్యబుద్ధి విస్తరించి స్వరాజ్యాభిలాష మందగించి పిరికితనం పెరిగిపోతున్నదని, ప్రాణభీతివల్ల ఆత్మబలిదానానికి సిద్ధమయ్యేవారు లేకపోయారని 'వైద్యవర' వేంకటరాజన్న అవధాని తననాటి సమాజస్థితిని వర్ణించిన పద్యమిది :

"ప్రజల దుష్టులనుండి రక్షించు వీరులు, వారిని( బీడించువార లైరి
అరిరాజబృందసంహరణాభిలాషులు, పందలై మూలల( బడిరి నే(డు
రాజ్యనిర్మాణదోర్బలమండితాగ్రణుల్, పరుల యేల్బడికి లో(బడిరి నే(డు
నిరత స్వరాజ్య సంస్కరణాభిలాషులు, దాసులై బ్రతికిరి దర్ప ముడిగి
దిక్తటవ్యాప్త పౌరుషాధిక్యు లిపుడు, సహజభీరుత్వబోధనాచార్యు లైరి
ఆత్మబలిదానమునకు ముందంజవేయు,వారు ప్రాణభీతిని తలల్ వంచినారు!"

రచనాకాలం స్పష్టంగా తెలియనందువల్ల కవి చెప్పిన విషయాలు సాధారణీకరణాలో నిర్దిష్ట దేశకాలపాత్రలకు నిర్దేశకాలో చెప్పలేం. క.హే. సత్యనారాయణరావు 'నిరుద్యోగ రాక్షసి'ని గురించి చెప్పిన పద్యా లివి :

"అడిగిన వాంఛితార్థము లొసంగెడి నిర్జరధేను కైవడిన్
జడియక పెక్కుదేశములవారల కన్నము నిచ్చు వృత్తులన్
దడయక కూర్చు నీ భరతఖండమునందు నపాంపతిన్ వడిన్
బొడమిన ఘోర హాలహలమో యన( బుట్టితివేల? రాక్షసీ!"

"క్షోణీజాతలతాది సస్యగణమున్ సంపూర్ణవర్షంబుచే
నానాశోభల నొంద(జేయునదియౌ ధారాధరస్తోమమున్
నానావస్థల( బెట్టు వాయుకరణిన్ సంపాదనేచ్ఛాదులన్
నానారీతుల( బాడొనర్ప( దగునే? వ్యాపారశూన్యత్వమా!"

'హరిజనదీనాలాపము'లను జొన్నలగడ్డ హనుమంతరెడ్డి వివరించిన వైనం :

"పుట్టినప్పటినుండి వెట్టిచాకిరి( జేయ, శారీరబలమెల్ల సమసిపోయె(
గులకాంత పగలెల్ల కూలి( జేసిన(గాని, యొక్కపూ(టకె తిండి చిక్కదాయె(
గొడుకు కష్టించియు( గొలువుచేసిన(గాని, కట్టుటకై గుడ్డకరవు వచ్చె
ఋణదాతలెల్లరు ఋణములు రెట్టించి, యన్యాయముగ( జేల నాచికొనిరి
కటకటా! జీవనము(జేయ( గష్టమయ్యె, నెవరికేనియు మామీ(ద నెనరులేదు
బ్రతుకు(దెఱవును జూపియు భద్రముగను, దీనులగు మమ్ము బ్రోవవే దేవదేవ!"

పులిగోటి ఆనందమాంబ 'స్త్రీవిద్య'ను గురించి చేసిన ప్రసంగ మీ పద్యం :

"విద్యయన్నను స్త్రీలకు వెగటుగల్గ, వనిత లజ్ఞాన లనుచును వాడుకొనుట
యబ్బురం బేమి? దీపంబు నవల(ద్రోయ, నున్న యింటిలో( జీకటి యుండకున్నె?"

'బాలవితంతువు'ల వ్యథలను తిరువాయిపేట రంగకవి వివరించిన పద్య మిది :

"తమ్ము పాలించు నాత్మజులపై( గల ప్రేమ, కన్నబాలికలపై నున్నటంద్రు

ఆత్మజాల్తా కాంతులై పునర్లగ్నముల్, జేయుట యొప్పని చేయుచుంద్రు
బాలవితంతులై పసుపుకుంకుమ లేక, ముంగిట నున్నను ముద మటంద్రు
మరుపెండ్లి తంద్రులౌ మగవారలకె కాని, స్త్రీకి లేదనుమాట స్థిర మటంద్రు
ధర్మశాస్త్రప్రమాణము ల్దాచి దోచి, బాల్యవైవాహములు చేసి భంగపఱచి
విధవలను జేసి దుష్క్రియావిధము రోసి, సేలునా నుంద్రు జనకు లిక్కాలమునను."

పై విషయాన్నే మరోవిధంగా 'భవ్యమతులారా!' అనే శీర్షికకింద పులిజాల వేంకట రంగారావు వ్యక్తీకరించాడు. ఆ పద్యమిది :

వీర్యసంపదచేత వెలుగొందవలె నన్న, బాల్యవివాహముల్ వదలవలయు
మతభేదముల మాని నుతికెక్కవలె నన్న, వెఱ్ఱివిశ్వాసముల్ వీడవలయు
భ్రూణహత్యాదులన్ బోఁద్రోలవలె నన్న, విధవల పెండ్లి గావింపవలయు
ననుకూల దాంపత్య మమరంగవలె నన్న, వరశుల్కముల రోసి ప్రబలవలయు
బలము తేజము వృద్ధిగావలయు ననిన, దురితభోగములం దుండి తొలఁగవలయు
మనము కావింపఁదగు ప్రయత్న మనయ మిది, భవ్యమతులార! భారతవాసులార!"

పైన పేర్కొన్న రచయిత లిద్దరూ బాల్యవివాహాలను వ్యతిరేకించారు. విధవావివాహాలను సమర్థించారు. పులిజాలవారు భ్రూణహత్యలను నివారించటానికయినా విధవావివాహాలు అవసరమని అదనంగా చెప్తూ, వరశుల్కాన్ని కూడా వ్యతిరేకించారు. కోస్తా ప్రాంతంలో బాల్యవివాహాల లెక్కలు తీసిన గురజాడ కన్యాశుల్కం సంగతి కూడా బయటపెట్టాడు కాని, వరశుల్కం మాట ప్రస్తావించినట్టు లేదు. కన్యాశుల్క దురాచారం సద్దుమణిగిందేమో గాని వరశుల్కవ్యవహారం విపరీతప్రమాణంలో పెరుగుతునే ఉంది - కాళ్ళకూరి నారాయణరావు నాటకం ప్రభావం చూపినట్లు లేదు. కవులు యావదాంధ్రదేశంలో ఒకే విధంగా స్పందించారు. కానీ సంఘం మారటం లేదు. ఇప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లోని భిన్నప్రాంతాల్లో బాల్యవివాహాలు జరుగుతూనే ఉన్నాయి. వాటిని వార్తామాధ్యాలు బహిరంగ పరుస్తూనే ఉన్నాయి. చట్టాలూ అధికారగణాలూ ప్రభుత్వాలూ నిర్వీర్యంగా నిష్క్రియగా కొనసాగుతూనే ఉన్నాయి. ఈ నిర్లిప్తసమాజం ఎప్పటికి మారుతుందో, దీన్ని ఎవరు ఏనాటికి మార్చగలరో అర్థం కావటం లేదు.

అరిగె రామస్వామి అనే కవి 'రైతులార!' అనే శీర్షిక కింద సమాజంలోని అట్టడుగువర్గాన్ని అగ్రవర్ణాలవారు హింసిస్తూనే ఉన్నారనీ, హిందూమతం తనను హింసించినవారికి సలాం చేస్తుంది గాని తాను పెట్టే హింసలు మాత్రం మానటం లేదని క్షోభపడతాడు. తిట్లు తినలేక మతాంతరీకరణకు సిద్ధపడుతున్నారని గుర్తించమని రైతులను వేడుకుంటున్నాడు. పచ్చినిజం చెప్పిన ఆ పద్యా లివి :

"మాలమాద్గు లన్యమతములఁ జేరిరి, ధేడ్‌చమా రటంచుఁ దిట్టుకతన
దేశమతము దిక్కు ధేడ్‌చమార్లే కదా?, రక్తబంధులార! రైతులార!"

*"హిందుమతము జీవహింసను నోర్వదు, మాలమాద్గులన్న మండిపడును*
*దనను హింసఁజేయఁ దగ సలాములఁజేయు, రక్తబంధులార! రైతులార!"*

సమకాలిక సమాజంలో వచ్చిన మార్పులను కె. సీతాపిరాట్టమ్మ స్పష్టంగా కింది పద్యంలో వివరించింది, 'కలిరాజు' అనే శీర్షిక కింద :

*"యజ్ఞయాగాది నిత్యాగ్నిహోత్రములెల్లఁ, జుట్టబీడీలలోఁ జుట్టఁబడియె*
*వేదపురాణముల్ విపరీతము లటంచు, నందఱి భావంబు లమరియుండె*
*భక్తివిజ్ఞానముల్ పరిపూర్ణమై తలన్, గ్రాఫు రూపంబుతోఁ గ్రాలుచుండె*
*నేయింటిపైఁ జూడ నింగ్లీషుభాషలోఁ బేర్లను జెక్కించి పెద్దలైరి*
*యాడువారలు మగవార లంద ఱెల్ల, నొక్క సీమంతమున నైక్యమొంది రిపుడు*
*సెప్పఁగాలేము నీయొక్క గొప్పదనము, లౌర! కలిరాజ! నీ మహిమాద్భుతంబు."*

నేటికి 70-75 సంవత్సరాల క్రితమే తెలంగాణా ప్రాంతంలో చుట్టలు, బీడీలు వాడుకలోకి వచ్చాయని, జుట్టు కత్తిరింపు (క్రాపింగ్) పిలకలనూ, తలకట్టునూ తగ్గించటం మొదలయిందని, స్త్రీపురుష వేషధారణలో సమానలక్షణాలు పొడుచూపుతున్నాయని, తెలుగు-ఉర్దూల్లోకాక ఇంగ్లీషులో ఇంటిమీద పేర్లు చెక్కించుకోవటం ఆరంభమయిందని సీతాపిరాట్టమ్మ పద్యం తెలియబరుస్తున్నది. ఈ లక్షణాలు పరివ్యాప్తమయినా కాకపోయినా మొదలుకాకపోతే కవయిత్రి ఈ విషయాలను ప్రస్తావించే అవకాశం లేదు.

పరిపాలకులు ఆంధ్రప్రదేశ్‌లోని భిన్నప్రాంతాల్లో ఒక్కరే కాకపోయినా, నైజాం రాజ్యం బ్రిటిష్‌వారికి సామంతరాజ్యమే కాబట్టి చక్రవర్తి ప్రత్యక్షపాలనలోని లక్షణాలు సామంత రాజ్యాల్లో పరోక్షంగానైనా వ్యాపించక తప్పిందికాదు. రాజకీయోద్యమాల సంగతి అటుంచితే, నేటి తెలంగాణాకు అన్నివైపులా బ్రిటిష్ పాలనలోని ప్రాంతాలే ఉన్నందువల్ల, తెలుగువారిలో కొద్దిపాటి మార్పులతో కాస్త వెనక ముందులుగా సమానసాంఘికమర్యాదలేఅమల్లో ఉన్నాయనాలి - సమానదురాచారాలతో సహా.

ఈ వ్యాసంలో చేరదగిన చేర్చదగిన ఆధారగ్రంథాలు ఇంకా చాలా ఉంటాయి. మరింత వివరంగా సమకూర్చవలసిన సాంఘికచరిత్రాంశాలూ ఉంటాయి. అవన్నీ సమకూర్చుకొని సమగ్రం కాకపోయినా సువిస్తృతమైన రచన చేయటానికి కావలసిన గ్రంథాలయ సౌకర్యాలు, తెలుగువారి ఆర్థికచరిత్రాదులకు సంబంధించిన విపుల సమాచారం ప్రస్తుతానికి నాకు అందుబాటులో లేవు. అంతకన్నా ముఖ్యం అంతగా శ్రమించగలిగిన ఆరోగ్యం వయస్సూ లేనేలేవు. అందువల్ల ఇదొక చిత్తు నమూనాగా భావించి, ఇందులోని లోపాలను సవరించి పద్యసాహిత్యం ఆధారంగా ఆంధ్రుల సాంఘికచరిత్రను మరింత విస్తరించి సురవరం ప్రతాపరెడ్డిగారు చూపిన మార్గంలో పురోగమించటానికి యువతీయువకులు నడుముకడ్తే సంతోషించ గలను. అంతకుమించి నేను చేయగలిగిందేమీ లేదు.

గ్రంథగతలోపాలకు బాధ్యత నాదే. అది క్షమార్హమైన అపరాధమని భావించవలసిందిగా పాఠకలోకాన్ని కోరుతున్నాను. సెలవు.

**Padyasahityam: Sanghacharitra (1900-1950)**

తెలుగులోని పద్యసాహిత్యంనుంచి సంఘ చరిత్రను సేకరించటం కష్టసాధ్యమైన పని. ఇరవయ్యో శతాబ్ది పద్యసాహిత్యం కూడా మన గ్రంథాలయాల దుస్థితివల్ల ఒక పట్టాన దొరకటం లేదు. దొరికినంతలో అందులోని సంఘచరిత్రను సమర్థించటానికి కావలసిన ఆర్థిక సాంస్కృతిక చరిత్రల్లో ఆధారగ్రంథాలు లభించకపోవటం మరో దయనీయస్థితి.

ఈ వ్యాసంలో దొరికినంతలో చేతనైనంతలో 1900-1950 మధ్యకాలంలోని తెలుగు పద్య సాహిత్యం ద్వారా తెలియవచ్చే సంఘచరిత్రను వివరించే ప్రయత్నం జరిగింది.

చరిత్రాభిమానులూ పద్యకవితాభిమానులూ ఈ వ్యాసాన్ని పరిశీలించి ఇంతకన్నా విపుల గ్రంథరచన చేస్తారని ఆశిస్తున్నాం.

ISBN: 81-7443-019-9